త్ । ఏతేషాంపూర్వోక్తానామభావేకనకాద్రిప్రతిగ్రహీతుః ప్రాయశ్చి
త్తమాహ ॥ —మార్కండేయః ॥ కనకాద్రింద్విజోయస్తుధృత్వానిష్కా
రణంసుధీః ॥ సతుశుద్ధిమవాప్నోతి కృచ్ఛ్రాణ్యయుతసంఖ్యయా। కృచ్ఛ్రా
ణిప్రాజాపత్యాని ॥ —లైంగే ॥ కనకాద్రింద్విజోధృత్వా రాజ్ఞః పుణ్యా
గమేసుధీః ॥ పశ్చాత్తాపసమాయుక్తః కృచ్ఛ్రాణామయుతంచరేత్ ॥ అ
ద్రేరాధిక్యాత్కృచ్ఛ్రాధిక్యమ్ ॥ — నృసింహపురాణే ॥ కృచ్ఛ్రైర
యుతసంఖ్యాకైః కనకాద్రింసముద్వహన్ । శుద్ధిమాప్నోతిముఖజః పున
స్సంస్కారపూర్వకమ్ ॥—బ్రాహ్మే ॥ కనకాద్రింద్విజోయస్తు రాజ్ఞఃపు
ణ్యాగమేవృథా । కృచ్ఛ్రైరయుతసంఖ్యాకై శ్శుద్ధిమాప్నోతినాన్యథా ॥*॥
—॥ ఇతిహేమాద్రౌ కనకాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥ * ॥—॥ అ

## రజతాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్

థరజతాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥ — వామనపురాణే ॥ రాజ
తంయోనుగృహ్ణీయాదచలంరాజవల్లభాత్ । పూర్వజోభోగమోహాత్మా
కాలపాశవశంగతః ॥ తత్పాపమనుభూయాశు బలాకస్సభవేద్వనే । త్రి
షుజన్మసుకంకస్స్యాచ్ఛ్వేతరోగీభవేత్తతః ॥ —శివపురాణే ॥ రాజభిఃపు
ణ్యకాలేషు దత్తంయోరజతాచలమ్। వినానిమిత్తైర్బహుభిః ప్రతిగృహ్యా
త్మభోగవాన్ ॥ శీఘ్రంకాలవశంగత్వా దుఃఖంతత్రానుభూయచ । బలా
కస్సభవేత్పశ్చాచ్ఛ్వేతరోగీసజాయతే ॥ జన్మత్రయేతుకంకస్స్యాత్కదా
ముక్తిర్నజాయతే ॥ —స్కాన్దే ॥ అచలంప్రతిగృహ్యాదౌ ప్రాయశ్చిత్త
పరాఙ్ముఖః । బలాకస్సంభవేత్పశ్చాత్కంకస్స్యాత్త్రిషుజన్మసు । కథంచి
న్ముక్తిమాపన్నశ్శ్వేతరోగీభవేత్తదా । ఏతదకృతప్రాయశ్చిత్తవిషయమ్ ॥
కృతప్రాయశ్చిత్తస్య నబలాకాదిజన్మ ॥ —తదేవాహ ॥ గారుడపురాణే ॥
ప్రాయశ్చిత్తేనపూతస్య ద్విజస్యాస్యశృణుష్వయత్ । తస్యైవనబలాకాది
ర్దైహికీశుద్ధిరీరితా । ప్రాయశ్చిత్తంపురాకృత్వా ధర్మశాస్త్రోక్తమా
ర్గతః । తతఃపశ్చాత్పునఃకర్మపంచగవ్యమతఃపరమ్ । ఏవంపూతస్యవిప్ర
స్య పక్షిజన్మనజాయతే ॥ కనకాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తార్థమత్రాపి ని
ష్కృతిర్నాన్యథా ॥ * ॥ — ॥ ఇతిరజతాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥

అథరత్నాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥ — మార్కండేయః ॥ ర

—*రత్నాచల ప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్*—

త్నాచలం ద్విజో గృహ్ణాద్రాజ్ఞః పుణ్యాగమే దినే ॥ న తస్య పునరావృత్తి ర్నర
కాద్దుఃఖదాయినః ॥ — బ్రహ్మాండే ॥ గఙ్గాతీరేథ గౌతమ్యాం కృష్ణవేణీన
దీతటే ॥ శ్రీశైలే సఙ్గమే వాపి భీమరథ్యానదీతటే ॥ అహోబిలే మహాక్షే
త్రే వైద్యనాథస్య సన్నిధౌ । కాఞ్చీస్థానే వెంకటాద్రౌ శ్రీరఙ్గే కుమ్భఘోణ
కే ॥ మధురాయాం మహారాజ చాపాగ్రే గన్ధమాదనే ॥ ద్విజో యో ధన
లోభేన రాజ్ఞా దత్తాని మానగిరీన్ । న ముక్తిస్తస్య విప్రస్య పైశాచ్యాజ్జన్మ
నాం త్రయే । నిష్కారణతయా భూప నిమజ్జన్నరకార్ణవే ॥ పిశాచాం తే
మర్త్యలోకే జాయతే పిటకాకృతిః । తేషాం మధ్యే యదా రాజన్ రత్నా
చలపరిగ్రహః । అరణ్యే నిర్జనే దేశే పిశాచో భవతి ధ్రువమ్ ॥ — స్కాన్దే
గ్రహణే సంక్రమే చైవ మన్వాదిషు యుగాదిషు ॥ అయనద్వితయే చైవ వ్య
తీపాతే చ వైధృతౌ ॥ కృష్ణాంగారచతుర్దశ్యామమాయాం పూర్ణిమాదినే ॥
ద్వాదశీషు స్వనక్షత్రే ద్విజో లోభపరాయణః । అచలాన్ రాజభిర్దత్తా
నేషు పుణ్యదినేష్విహ । ధృత్వేతి శేషః । అకృత్వా నిష్కృతిం తేషాం తత్త
త్పాపవిముక్తయే । యమస్య సదనం గత్వా హ్యనుభూయ మహద్భయమ్ ॥
పిశాచో భవతి క్షిప్రం విజనే నిర్జలే వనే ॥ — భవిష్యోత్తరే ॥ రత్నాచల
మిమం ధృత్వా ద్విజో నిష్కారణాన్మనే । అకృత్వా నిష్కృతిం తస్య మృత్వా
నరకమాప్నుయాత్ ॥ పిశాచానుభవం కృత్వా జాయతే పిటకాకృతిః । త
స్యైవ నిష్కృతిరియం బ్రహ్మణా పరికల్పితా ॥ అరణ్యం నిర్జనం గత్వా శూ
న్యం దేవాలయం విశేత్ । కృత్వా త్రిషవణస్నానం భస్మకృష్ణాజినం వహన్
మౌనవ్రతముపాస్థాయ వీరాసనముపాశ్రితః । రుద్రాధ్యాయం జపన్ని
త్యం తావత్సంఖ్యాం సమాచరేత్ । యావదస్తంగతో భానుర్విరమేత్తావ
తా జపాత్ ॥ అవ్రితఘ్నుం పయో వాపి హ్యశక్తౌ ఫలభోజనమ్ । స్వపేచ్చ
స్థణ్డిలే రాత్రౌ ద్విజస్యైతస్య నిష్కృతిః । ఏవం బుతుత్రయం నీత్వా శు
ద్ధిమాప్నోతి హైహికీమ్ । అశక్తౌ తద్ధనస్యార్ధం తదర్ధం వ్యయమాచరేత్ ॥
ఏవం చేన్నిష్కృతిర్భూప రత్నాచలపరిగ్రహాత్ । పునస్సంస్కారమాత్రేణ

శుద్ధో భవతి నిశ్చయ ఇతి। ప్రతిగ్రహధనస్య చతుర్థభాగవ్యయేన పూర్వవత్ప్రాయశ్చిత్తం కృత్వా పునస్సంస్కారకాలే బ్రహ్మోపదేశం గాయత్రీం గురుణా స్వీకృత్య శుద్ధిమాప్నోతి। నాన్యథా శుద్ధిరిత్యర్థః ॥—॥ ఇతి రత్నాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥ * * * * * * * * * * * *

—*ధాన్యాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్*—

అథ ధాన్యాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥—॥ దేవీపురాణే ॥ శ్లో ॥ ధాన్యాచలప్రదాతా చ పుణ్యక్షేత్రేషు పర్వసు। అర్చయిత్వా ద్విజాగ్ర్యాయ స వై లోకాధిపో భవేత్ ॥—॥ కౌర్మే ॥ అర్చితాయ ద్విజాగ్ర్యాయ ధాన్యాచలమనుత్తమమ్। అర్పితం శాస్త్రమార్గేణ పుణ్యకాలేషు పర్వసు ॥ యో దద్యాత్పృథివీపాల స గచ్ఛేద్విష్ణుమందిరమ్ ॥—॥ లైంగే ॥ ధాన్యాచలం ద్విజో మోహాత్పుణ్యకాలే ఉపాగతే। ప్రతిగృహ్య నృపశ్రేష్ఠాదకృత్వా ధర్మసంగ్రహమ్ ॥ ఆరామేష్వృక్షదేశేషు పిశాచో మర్త్యగో భవేత్। తత్రానుభూయ నరకం పునర్యాపకతాం వ్రజేత్ ॥—॥ స్కాందే ॥ శృణు షణ్ముఖ వక్ష్యామి ధాన్యాచలపరిగ్రహే। దోషం ప్రతిగ్రహీతుర్వై రాజ్ఞో ధర్మానువర్తినః ॥ శాలిక్షేత్రే వనేష్వేవమారామే వృక్షసంకులే। పిశాచో మర్త్యగో నామ త్రాసయన్వై జనాన్ బహూన్ ॥ మహాంతం నరకం భుక్త్వా హ్యకృత్వా ధర్మనిష్కృతిమ్ స భవేన్మ్లాపకస్థూలస్త్రిషు జన్మసు సంగ్రహాత్ ॥—॥ భవిష్యోత్తరే ॥ ధాన్యాచలం ద్విజో ధృత్వా ద్రవ్యలోభపరాయణః। అకృత్వా నిష్కృతిం తస్య స భవేత్పిశితాశనః ॥ తద్దోషపరిహారార్థం కృత్వా చాంద్రాయణత్రయమ్। పునస్సంస్కారమాత్రేణ శుద్ధిమాప్నోతి దైహికీమ్ ॥—॥ బ్రహ్మకైవర్తే ॥ పుణ్యకాలేషు సంక్రాంత్యాం ద్విజో రాజ్ఞః పరిగ్రహాత్। ధాన్యాచలస్య మహతస్తస్య నిష్కృతిరీరితా ॥ యోగాదికం పరాకృత్య ప్రోక్తం చాంద్రాయణత్రయం। పునస్సంస్కారపూతాత్మా గాయత్రీమభ్యసేద్ద్విజాత్ ॥ తాం పఠన్ప్రయతో నిత్యం వర్తయేద్యది శుద్ధిమాన్। అన్యథా నిష్కృతిర్నాస్తి పాపస్యైతస్య గౌరవాత్ ॥—॥ విష్ణుపురాణే ॥ సప్తాచలాస్సముద్రాశ్చ నిర్మితాశ్చక్రపాణినా। జనానాం పాపనాశాయ స్మరణాత్కీర్తనాదిహ ॥ తేషాం ప్రతిగ్రహే రాజన్ పతితస్స్యాద్ద్విజాధమః। అతస్తస్య పునః కర్మ మునిభిః పరికీర్తి

తమ్ । పునఃకర్మపునస్సంస్కారఇత్యర్థః ॥—॥ ఇతి హేమాద్రౌ ధాన్యా చలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥—॥ అథ తిలాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమా

—*తిలాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్*—

హ ॥—॥ నారదీయే ॥శ్లో॥ తిలాచలఃకాలపురుషస్తిలధేనుస్తిలాస్తథా । తి లచక్రంప్రతికృతిరార్ద్రఃకృష్ణాజినంతథా ॥ తిలకృష్ణాజినంచైవ శకటంసయు గంతథా ॥ ఏతానివిప్రవర్యాణాం మహానరకదానివై ॥ నిష్కారణతయాగా జః ప్రతిగృహ్యద్విజాధమః । మహాంతంనరకంభుక్త్వా స్త్రీజన్మతదనంతరం॥ పశ్చాత్తాపసమాయుక్తః ప్రాయశ్చిత్తంయదీచ్ఛతి । ప్రాయశ్చిత్తేనమహ తా పునస్సంస్కారమర్హతి ॥ — ॥ బ్రహ్మాండే ॥ ధనలోభేనయోవిప్రః ప్రతిగృహ్యతిలాచలమ్ । సప్తజన్మసునారీస్యాత్ తత్రాపివిధవాభవేత్ ॥ నా ర్యేవనరకస్థానం కిమన్యైర్బహుభాషితైః । వైధవ్యసదృశందుఃఖంస్త్రీణా మన్యన్నవిద్యతే ॥ తత్రాపిబాలవైధవ్యం తిలాచలపరిగ్రహాత్ ॥—॥స్కాం దే ॥ పుణ్యకాలేషుయఃపుత్ర పుణ్యతీర్థేషుపర్వసు । తిలాచలంద్విజోధృ త్వా మహాంతంనరకంవ్రజేత్॥ పశ్చాద్భవతినారీత్వం సప్తజన్మసుకుత్సితమ్॥ వైధవ్యదుఃఖితామేత్యపశ్చాతక్షండూతిమాన్భవేత్ ॥ అతోద్విజన్మనఃపుత్ర ధిగేతస్యప్రతిగ్రహమ్ । కృత్వాప్రతిగ్రహంవిప్రో యాగాదిషుపరాఙ్ముఖః ॥ అజాగళస్తనఇవ తస్యజన్మనిరర్థకమ్ ॥—॥ భవిష్యోత్తరే ॥ విప్రస్తిలాచ లంధృత్వా రాజభిఃపుణ్యపర్వసు । శుద్ధోయాగాదికంకృత్వా హ్యన్యథాని త్యసూతకీ ॥—॥ కౌర్మే ॥ యావంతఃపర్వతారాజన్ తిలారాశీకృతాన్నృభిః॥ తావంతిపాపజాతాని కర్తుఃపుత్రననంశయః ॥ అతోవిప్రవరాణాంహి గ ర్హితస్తత్పరిగ్రహః ॥ యదీచ్ఛేన్మనసాశుద్ధిం తిలాచలపరిగ్రహాత్ ॥ అను జ్ఞాతోద్విజేంద్రాణాం మనసాహరిమర్చయన్। నద్యాంసముద్రగామిన్యాం ప్రాతస్స్నాత్వాయథావిధి ॥ నిత్యకర్మసమాప్యాశు స్వగృహేదేవసన్నిధౌ॥ స్వగృహ్యోగ్నింప్రతిష్ఠాప్య హ్యాజ్యభాగాంతమాచరేత్ ॥ త్రియంబకేతిమం త్రేణ తిలైరాజ్యవిమిశ్రితైః । ఆసాయంజుహుయాద్వహ్నౌ తావత్సంఖ్యాం సముద్వహన్ ॥ విరమయ్యతదాహోమం తమగ్నింనత్యజేద్బుధః ।అవ్రతఘ్నౌ బ్రాన్ భుక్త్వాస్వపేద్దైనగృహేముదా ॥ పరేద్యుఃప్రాతరుత్థాయపూర్వవ

ద్ధోమమాచరేత్ । ఉపోష్య రజనీమేకాం పునస్సంస్కారమాచరేత్ ॥ ఏషావి
శుద్ధిరుదితా తిలాచలపరిగ్రహే । అన్యథా నిష్కృతిర్నాస్తి దాతైస్తీర్థా
పగాహనైః ॥ ప్రయుతం దశలక్షమ్ ॥—॥ తదుక్తం మహాభారతే ॥ అయు
తం దశసాహస్రం నియుతం లక్షముచ్యతే । ప్రయుతం దశలక్షం స్యాదర్బుదం
కోటిరుచ్యతే ॥ ఏతత్ప్రాయశ్చిత్తాకరణవిషయే । స్వధనస్య చతుర్థభాగే
న పూర్వవత్ప్రాయశ్చిత్తం కుర్యాదన్యథా న నిష్కృతిః ॥—॥ ఇతి హేమా
ద్రౌ తిలాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥—॥ అథ కార్పాసాచలప్రతిగ్ర

## —*కార్పాసాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్*—

హప్రాయశ్చిత్తమాహ ॥—॥ మార్కండేయః ॥ సబీజం కృమికీటాద్యైర్విశో
ధితం పుణ్యపర్వసు । కార్పాసం ద్విజవర్యాయ యో దద్యాత్సోఽపి ముక్తిభాక్ ॥
—బ్రహ్మాండే ॥ కార్పాసస్యాచలం రాజా పుణ్యక్షేత్రేషు పర్వసు । అర్చి
తం గంధపుష్పాద్యైశ్శాస్త్రమార్గేణ ధర్మతః ॥ యో దద్యాద్ద్విజవర్యాయ
సముక్తస్సంసృతేర్భయాత్ । తద్బీజానీహ యావంతి తావత్కాలం వసేద్ది
వి ॥—॥ కౌర్మే ॥ కార్పాసస్యాచలం విప్రః ప్రతిగృహ్యాజనాధిపాత్ । సద్యః
క్షరతి పుణ్యం స్వం కర్తుః పాపం చ సంవిశేత్ ॥ స విప్రః పతితో భూయాద్దాస్య
ఘాతీ నరేశ్వర । మృతః కాలవశం గత్వా కాకోలం నరకం వ్రజేత్ ॥ తదంతే
భువమాసాద్య శ్వేతరోగీ దరిద్రవాన్ । పత్నీపుత్రపరిత్యాగే దుఃఖితస్స్యా
త్పునః పునః ॥—॥ బ్రహ్మాండే ॥ యో విప్రః పుణ్యకాలేషు గిరిం కార్పాససం
జ్ఞితం । అర్చితం గంధపుష్పాద్యైః ప్రతిగృహ్యాజనాధిపాత్ ॥ అకృత్వా త
ద్వ్రియం సమ్యగ్యమపాశవశం గతః । కాకోలం నరకం గత్వా శ్వేతరోగీ భవే
ద్భువి ॥ అతస్తద్దోషశాంత్యర్థం ప్రాయశ్చిత్తం చరేద్బుధః ॥—॥ స్కాం
దే ॥ కార్పాసస్యాచలే పుత్ర ప్రాయశ్చిత్తమిదం శృణు । పశ్చాత్తాపసమా
యుక్తః ప్రాప్యానుజ్ఞాం ద్విజోత్తమైః ॥ విపినం నిర్జనం గత్వా వపనం కార
యేత్తతః । తత్ర త్రిషవణస్నానం కృత్వా విష్ణుపరాయణః ॥ నాభిదఘ్నజలే
స్థిత్వా ప్రాఙ్ముఖోదఙ్ముఖశ్శుచిః । పురుషసూక్తం జపంస్తిష్ఠేద్దానతస్తావద
యాజ్జలే ॥ తతో విరమ్య సహస్రసంఖ్యాం మనసి ధారయన్ । హస్తద్వయ
ఘుటితాన్సక్తూన్భక్షయేద్గుడవర్జితమ్ ॥ స్వపేన్నారాయణస్యాగ్రే కేవలే

స్థండిలేవ్రతీ । పునఃపరేద్యురుత్థాయ పూర్వవజ్జపమాచరేత్ ॥ తత్రైవపూర్వవత్సంఖ్యా యావత్కాలేనసాధ్యతే । తదావిరమ్యపూర్వేద్యురుపోష్యవిధిపూర్వకమ్ ॥ పునఃకర్మతథాకుర్యాద్దండమౌంజ్యజినంవినా ।. ఏతేనైవవిశుద్ధిస్స్యాన్నాన్యథాశుద్ధిరిష్యతే ॥ఏతత్ప్రాయశ్చిత్తాకగణే॥ పూర్వవత్సర్వధనార్థార్ధప్రాయశ్చిత్తంవిశుద్ధిదమ్.।స్వధనస్యచతుర్థభాగేన పూర్వవత్ప్రాయశ్చిత్తంకృత్వాశుద్ధో భవతీత్యర్థః॥నచాన్యథా ॥—॥ ఇతికార్పాసాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥—॥ అథలవణాచలప్రతిగ్రహప్రాయశ్చిత్త

## —*లవణాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ *—

మాహ ॥—॥ మార్కండేయపురాణే॥శ్లో॥లవణాచలంనరపతిరాదదాతుకర్యాన్నదీపుణ్యాతిథిపుపర్వసు । విప్రాయవేదాధ్యయనాత్మశీలసైనతస్యభూమౌపునరాత్మసమ్భవః ॥—॥ స్కాందే ॥ పురాహిమవతఃపార్శ్వేకన్యకా కాచిదప్సరాః । సుకేశీసుదతీసుభ్రూర్హాసస్మితసుందరస్తనీ ॥ విహారార్థం బహిర్గత్వా విచచారగృహాంకణే । తదాతామవలోక్యాథ రావణోనామదైత్యరాట్ ॥ కామాతురస్తదాతన్వీహస్తం జగ్రాహపాణినా ।హస్తస్యస్పర్శమాత్రేణ తదాభూత్స్వేదోదయః॥ స్తమ్భప్రళయరోమాంచాస్స్వేదోవైవర్ణ్యవేపథూ । అశ్రువైస్వర్యమిత్యష్టౌ సాత్వికాఃపరికీర్తితాః॥స్వేదోదకంతదాతస్యా నదీరూపాత్ప్రవర్తతే । తదాప్రభృత్యసౌసింధులావణేభువివిశ్రుతా ॥ సాతదాహిమవత్పార్శ్వాత్ప్రత్యేకంసాగరంగతా। స్వేదరూపప్రవాహేణ షత్త్రిభాష్టపరిచ్యుతః ॥ అంగీచకారసలిలం లావణ్యంలవణాప్సుసి । తదాప్రభృత్యసౌసింధురుదకేజలసంగమాత్ ॥అత్యాపరతయారాజ్ఞ లవణోదధిరీరితః । తతోత్పన్నంతులవణం దోషాధికతయామునే ॥ నప్రతిగ్రహణంతస్య కేచిదిచ్ఛంతిసూరయః । లవణంచాణుమాత్రంవా ప్రతిగృహ్యద్విజోయది ॥ తన్నిష్కృతింపరాకృత్య వింధ్యాదేశేపిశాచతా ॥ —॥ మార్కండేయః ॥ లవణస్యాచలంధృత్వా రాజ్ఞఃపుణ్యాగమేసకృత్। విప్రోయదీహదుష్టాత్మా యమపాశవశంగతః ॥ మహాంతంనరకంభుక్త్వాపిశాచోభవతిధ్రువం । పశ్చాద్భువముపాగమ్య స్వేదాంగోజాయతేసదా ॥—॥ బ్రహ్మకైవర్తే ॥ పూర్వజోహ్యచలంకృత్వా లావణంరాజవల్లభాత్। పుణ్యా

తీర్థే వా పుణ్యదేశే పుణ్యకాలేషు పర్వసు ॥ నిష్కారణం తయా లోభాద్యను లో-
కముపాగతః । మహద్భయం తదా భుక్త్వా పునర్భవముపావిశేత్ ॥ పిశాచజ-
న్మతామేత్య తదంతే స్వేన దేహవాన్ । అతః ప్రతిగ్రహస్తస్య గర్హితో లో-
కవర్జితః ॥—॥ శైవే ॥ ముఖజో బాహుజో వాపి కృత్వా లావణ్యమచలం భువి ।
పిశాచత్వం భవేత్తస్య స్వదారాం గోజాయతే పునః ॥ తస్య పాపవిశుద్ధ్యర్థం ప్రా-
యశ్చిత్తమిదం ద్విజైః । దర్శితం లోకరక్షార్థం తదహం కథయామి తే ॥
విప్రానుజ్ఞామవాప్యాశు పశ్చాత్తాపసమన్వితః । స్నాత్వా శుద్ధనదీతోయే
గత్వా పర్వతగహ్వరం ॥ కంటకం బాదరం ధృత్వా స్వయం పూర్వాభిముఖస్త-
స్తదా । తిష్ఠంస్తత్ర జపేదేనం సర్వపాపాపనుత్తయే ॥ నారాయణం హృదా
ధ్యాయన్ సర్వపాపప్రణాశనం । ఆధారం సర్వమంత్రాణాం యావదస్తం
గతో రవిః ॥ తదా విరమ్య సహస్రం గణనాం హృది ధారయన్ । హస్తద్వయ-
ప్రమాణేన పిబేద్గోదుగ్ధమాదరాత్ ॥ స్వపేన్నారాయణస్యాగ్రే స్థండిలే
కేవలే భువః । తతః పరేద్యురుత్థాయ పూర్వవజ్జపమాచరేత్ ॥ ఏవంబుతుద్వా-
యం కృత్వా నియుతం విధిపూర్వకం । రుద్రాధ్యాయం పఠేజ్జప్త్వా ఉత విష్ణోర-
నుజ్ఞయా ॥ ఏతద్ద్వయోరభావేపి ప్రాయశ్చిత్తం సమాచరేత్ ।పూర్వవత్సర్వ-
థనాథార్థం ప్రాయశ్చిత్తం విశుద్ధిదం ॥ అన్యథా నివృత్తిర్నాస్తి లవణా-
చలసంగ్రహే । నియుతం నమకచమకౌ ఆరణ్యకం దశాధ్యాయాః నారాయ-
ణం సర్వమంత్రాణామాకరత్వాల్లవణాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తం భవ-
తి । దశాధ్యాయం సకృజ్జప్త్వా సర్వపాపైః ప్రముచ్యతే ॥ తదేవాహ ॥ అత్యా-
శనాదతీపానాద్యచ్చ ఉగ్రాత్ప్రతిగ్రహాదతి ॥ అత్యాశనం సపిండీకరణశ్రా-
ద్ధాదిషు నిమిత్తస్థానే భోజనం ॥ అతీపానం శూద్రప్రపాదిషు పానం ॥ ఉగ్రప్ర-
తిగ్రహాః శూద్రాదేర్లవణాచలాదిప్రతిగ్రహాః ॥ ప్రాయశ్చిత్తపక్షే పున-
స్సంస్కారం పూర్వవత్కృత్వా శుద్ధో భవతి ॥ నాన్యథేతి ॥—॥ ఇతి లవణా-
చలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥—॥ అథ గుడాది దశధేనుప్రతిగ్రహప్రాయ-
శ్చిత్తం బ్రువన్ తత్రాదౌ గుడధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥—॥ మా-

## —*గుడధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్*—

త్స్యే ॥ శ్లో ॥ గుడధేనుస్తిలమయీ ఘృతధేనురనంతరం । ధేనుర్జలమయీ పా

శ్చాత్ క్షీరధేనురనంతరం ॥ మధుధేనుస్తతః పశ్చాచ్ఛర్కరాధేనురుత్తమా ॥ దధిధేనురిక్షురసధేనుః ప్రత్యక్షరూపిణీ ॥ ఇతి దశధేనవః॥ తాసాం ప్రతిగ్రహే పృథక్పృథక్ప్రాయశ్చిత్తమాహ ॥—॥ మార్కండేయః ॥ ధేనుం గుడమయీంకృత్వా తామలంకృత్య సర్వతః । పుణ్యకాలే పుణ్యతీర్థే యో దద్యాత్సోఽపి దేవరాట్ ॥—॥ శైవే ॥ పుణ్యకాలే పుణ్యతీర్థే యో రాజా గుడనిర్మితామ్ । ధేనుం సదక్షిణాం దద్యాద్విప్రాయాధ్యాత్మవేదినే ॥ సోఽపి విష్ణుపదం యాతి తత్రైవ పరిమోదతే । పునర్భువముపాగమ్య మండలాధిపతిర్భవేత్ ॥—॥ గారుడే ॥ గుడధేనుం సమభ్యర్చ్య గంధవస్త్రాదిభూషణైః । బ్రాహ్మణాయ సుశీలాయ యో దద్యాత్సోఽపి ముక్తిభాక్ ॥ యో విప్రస్తాం తదా గృహ్ణన్ పరలోకపరాఙ్ముఖః । యమస్య వశమాపన్నః కాలసూత్రనిపీడితః ॥ పునర్భువముపాగమ్య జాయతే భిల్లజన్మవాన్ । యాగాదికం తతః కృత్వా శుద్ధిమాప్నోత్యనుత్తమాం ॥—॥ కౌర్మే ॥ ధేనుం గుడమయీం గంధవస్త్రాదిభిరలంకృతామ్ । పుణ్యకాలే పుణ్యతీర్థే పుణ్యక్షేత్రే నదీతటే ॥ యో గృహ్ణన్ పృథివీపాలాద్బ్రాహ్మణో ధనలోభతః । యమలోకముపాగమ్య పీడితో యమకింకరైః ॥ భిల్లజాతిర్భవేద్భూమౌ యాగాదిషు పరాఙ్ముఖః ॥ ప్రాయశ్చిత్తమిదం కృత్వా పశ్చాత్తాపసమన్వితః । విప్రానుజ్ఞామవాప్యాశు ప్రతిపాన్నతాన్యథావిధి ॥ ఇదం కరిష్యే నియమం ప్రాయశ్చిత్తం విశుద్ధయే । ఇత్యుక్త్వా త్రిపలం తిష్ఠేద్ధేమంతే శీతసంకటే ॥ జలాహారస్తదా తిష్ఠేద్యావత్ప్రాతః పునర్భవేత్ । ప్రాతరారభ్య మేధావీ స్మరన్నారాయణం విభుం ॥ చతుర్థే కాల ఆయాతే యావకం భోజనం చరేత్ । యావకమితి హస్తమాత్రీయవాన్ పక్త్వా భోజయేత్ । పునరస్తంగతే భానౌ పూర్వవజ్జపమాచరేత్ ॥ జపేన్మృత్యుంజయస్యాన్యాసధ్యానపూర్వకం । అనాహారో బహిరేవ నిశాగే వర్షతి సతి సంఖ్యాముద్వహన్ తిష్ఠేత్ ॥ ఏవమృతుద్వయం నీత్వా పంచగవ్యం పిబేత్తదా । ఏవంకృతే విశుద్ధః స్యాన్నాన్యథా శుద్ధిమాప్నుయాత్ ॥ ఏతదాచరణాశక్తౌ పూర్వవత్స్వధనచతుర్థభాగేన ప్రాయశ్చిత్తం కృత్వా శుద్ధిమాప్నోతి ॥ న పునస్సంస్కారాదిః ॥—॥ ఇతి గుడధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తం ॥—॥ అథ తిలధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ దేవీపురాణే

—*తిలధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్*—

॥శ్లో॥ మహాపుణ్యానదీతీరే వ్యతీపాతేచ వైధృతౌ । గ్రహణేసంక్రమేచైవమన్వాదిషుయుగాదిషు ॥ రాజ్ఞాదత్తాంతిలమయీం ధేనుంగంధాక్షతైరలం । అర్చితాంయోద్విజోధృత్వా సవైమృత్యువశంగతః ॥ అనుభూయమహాఘోరాం వేదనాందూతనిర్మితాం । పశ్చాద్భవతిపాపాత్మా నిష్కృతోఽరోగవాన్భువి ॥—॥ కౌర్మే ॥ పుణ్యకాలేషుపుణ్యాహే జన్మర్క్షేజన్మసమ్భవే । గంధాద్యైరర్చితాందత్తాంరాజభిస్తిలరూపిణీం॥యోద్విజఃప్రతిగృహ్యైశుష్కాం కృత్వానిష్కృతింశుభాం । తత్రైవమృత్యుమాయాతి హ్యనుభూయమహద్భయం ॥ పశ్చాత్పాపీమహాఘోరో నిష్కృతోఽరోగవాన్భవేత్ । తిలాస్సంతిహియావంతో హ్యాజినేధేనువత్సయోః ॥ తావద్వర్షసహస్రాణి నరకేవాసమశ్నుతే । తస్యైవనిత్యకర్మాణి క్షరంత్యేతత్ప్రతిగ్రహాత్ । తస్మాత్ప్రతిగ్రహోధేనోర్నిష్కారణతయానృప । గర్హితోముఖజానాంహి తస్మాదేతత్పరిత్యజేత్ ॥ లైంగే ॥ పూర్వోక్తేష్వేషుపుణ్యేషు దినేషుపృథివీపతేః । ధేనుంతిలమయీంధృత్వా విప్రోభోగపరాయణః ॥ తస్యనిత్యంచకామ్యంచ ఇష్టాపూర్తాదికంచయత్ । సర్వంక్షరతితత్కాలే దానమశ్రోత్రియేయథా ॥ తస్యైవనిష్కృతిరియం కథితామునిపుంగవైః । తద్ద్రవ్యంసంపరిత్యజ్య దక్షిణామాత్రముద్వహేత్ ॥ ఆధానంవాక్రతుంవాపికృత్వాసర్వస్వదక్షిణమ్ । తతశ్శుద్ధిమవాప్నోతి పునస్సంస్కారపూర్వకమ్ ॥ అన్యథానిష్కృతిర్నాస్తి పంచచాంద్రాయణైర్వినా ॥—॥ స్కాందే ॥ దౌర్బ్రాహ్మణ్యానివృత్త్యర్థంధేనుంతిలమయీంద్విజః । అగ్న్యాధేయంచయాగంవా కృత్వాతన్నావశేషయేత్ ॥ ప్రధానంసంపరిత్యజ్య నదోషస్తత్ప్రతిగ్రహాత్ । అథవాపంచభిశ్చాంద్రైశ్శుద్ధిమాప్నోతివైదికీం ॥ పునస్సంస్కారమాత్రేణ నిత్యకర్మస్వివాహితా । ఉభయంయఃపరిత్యజ్య కేవలంభోగలాలుపః ॥ తదంతేనిష్ప్రజోభూయాత్సమహారోగవాన్భువి ॥—॥ ఇతి తిలధేను ప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥—॥ అథఘృతధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ—

—*ఘృతధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్*—

స్కాందే ॥ ధేనుంఘృతమయీంశుద్ధాం కృష్ణాజినపరిష్కృతామ్ । స్వర్చి

తాం గంధపుష్పాద్యై రాజభిః పుణ్యసంగమే ॥ వృథాపరిగ్రహం కృత్వా ద్వి
జో యాగాదిభిర్వినా। యమలోకముపాగమ్య కుమ్భీపాకే నిమజ్జతి ॥ తదంతే
భువమాసాద్య వైణవో జాయతే భువి । అతో మహాదోషభయాత్పరిత్యాజ్యా
ద్విజన్మభిః ॥—॥ లైంగే ॥ ధేనుమేకాం ద్విజో రాజన్నజినే ఘృతనిర్మితాం ।
సవత్సాం భూషణైర్వస్త్రైర్విప్రా గ్రహణతయా వహేత్ ॥ కుమ్భీపాకే నిరుచ్ఛ్వా
సః పీడితో యమకింకరైః । తదంతే పృథివీమేత్య వైణవానాం కులోద్భవః ॥ హీ
నజాతిషు సర్వాసు భూత్వా భూత్వా న నిష్కృతిః । యాగాదికమకృత్వా చే
దేతస్మాన్న విముచ్యతే ॥—॥ గారుడే ॥ కృష్ణాజినేషు పుణ్యేషు నిర్మితాం ఘృ
తరూపిణీం । పూజితాం రాజపురుషైర్ధేనుం యో ముఖజో వహేత్ ॥ తస్యైవ
నరకో ఘోరః కుమ్భీపాకస్సముజ్జ్వలః । తత్ర పక్త్వా పునః పాపీ ప్రాప్య వైణ
వజన్మతామ్ । నానాయోనిషు సంభూయ యాగాదిషు పరాఙ్ముఖః । పశ్చా
త్తాపసమాయుక్తః ప్రాయశ్చిత్తీ భవేత్తతః ॥—॥ తత్ప్రాయశ్చిత్తమాహ
బ్రహ్మాండే ॥ ఘృతధేనుం రాజదత్తాం స్వర్చితాం వస్త్రభూషణైః । పుణ్య
కాలేషు పుణ్యాహే ప్రతిగృహ్య ద్విజో యది ॥ ద్రవ్యలోభపరీతాత్మా ప్రాయ
శ్చిత్తమిదం చరేత్ । నదీషు పుణ్యతీర్థేషు స్నాత్వా ప్రాతర్యథావిధి ॥ స్వగృ
హం పునరాగమ్య స్వగృహ్యాగ్నివిశుద్ధయే । అగ్నీంధనాదికం కృత్వా ఆజ్యభా
గాంతమాచరేత్ ॥ తస్మిన్నగ్నౌ సపత్నీకః కూశ్మాండం జుహుయాద్ఘృతం। తే
దథర్వంగణహోమం చ కృత్వా శుద్ధిమవాప్నుయాత్ ॥ నిరాహారస్తదా తిష్ఠే
త్పయో వా ధేనుసమ్భవం । అథశ్శాయీ భవేత్తత్ర పత్నీపుత్రవివర్జితః ॥
ఏవం ప్రతిదినం కుర్యాత్సంఖ్యా యావత్సమాప్యతే । తదంతే భోజయేద్గవ్యం
హోమశేషం విశుద్ధయే ॥ బ్రాహ్మణాన్భోజయేత్పశ్చాత్పరిక్రమ్య ప్రణమ్య చ।
స్వయం చ పారణం కుర్యాత్పత్నీపుత్రసమన్వితః ॥ ఏవం కృత్వా ద్విజశ్శుద్ధో
హ్యన్యథా పాతకీ భవేత్ । ఏతదాచరణే త్వసమర్థః ॥ పూర్వవత్స్వధనా
ర్ధార్ధప్రాయశ్చిత్తం విశుద్ధిదం॥ ఇత్యుక్తరీత్యా స్వధనచతుర్థభాగేన పూ
ర్వవత్ప్రాయశ్చిత్తం కృత్వా శుద్ధిమాప్నోతి ॥—॥ ఇతి హేమాద్రౌ స్మృతధే
నుప్రతిగ్రహప్రాయశ్చిత్తం ॥—॥ అథ జలధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తే

——*జలధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్*——

మాహ ॥—॥ స్కాందే ॥ శృణువత్స ప్రవక్ష్యామి జలధేనుప్రతిగ్రహే ॥ అమాయాం పర్వసంక్రాన్తౌ ద్వాదశీపూర్ణిమాదినే । మహోత్సవే తీర్థేషు పుణ్యేషు తథాపుణ్యాలయేషు చ । కృష్ణాజినేవినిర్మాయ ధేనుం జలమయీం శుభాం । అర్చితాం గన్ధపుష్పాద్యైర్ధర్మమార్గేణ రాజభిః । దత్తాం ద్విజో వృథా గ్రాహీ ద్రవ్యలోభపరాయణః ॥ ఆత్మనః పరలోకార్థమకృత్వా నిష్కృతిం యది । స్నానుధూయ మహత్పాపం యమలోకే తదాజ్ఞయా ॥ పునర్భూర్భాగమాసాద్య జాయతే కచ్ఛపో మహాన్ । అతః ప్రతిగ్రహోద్దోషః పూర్వజానామిహాన్వతః ॥—॥ కౌర్మే ॥ ధృత్వా జలమయీం ధేనుం ద్విజో లోభపరాయణః అర్చితాం ప్రభుభిః పూతాం శాస్త్రప్రపూతేన వర్త్మనా । యాగాదికం పరాకృత్య పరాకృత్యైవ నిష్కృతిమ్ ॥ స్థిత్వా త్వఘోరోదకే కూపే తదంతే భువమావిశేత్ ॥ అగాధే జాయతే కూర్మో హ్రదే జలపరిష్కృతే । ఏతద్దోషభయాన్మూఢపత్యాజ్యోఽపి పైః ప్రతిగ్రహః ॥—॥ మాత్స్యే ॥ ప్రతిగృహ్య ద్విజో లోభాద్ధేనుం జలమయీం నృపాత్ । యాగాదికం స్వశుద్ధిం వా హ్యకృత్వా భోగలోలుపః ॥ యమలోకే మహాఘోరే పీత్వా త్వఘోరోదకం బలాత్ । తదన్తైత్రసమాగత్య జాయతే కచ్ఛపో జలే ॥ ఏతద్దోషాపశాంత్యర్థం ప్రాయశ్చిత్తం సమాచరేత్ । గంగాయాం వాథ గౌతమ్యాం కృష్ణవేణ్యాం నదీతటే ॥ కావేర్యాం తుంగభద్రాయాం చాపాగ్రిగన్ధమాదనే । ఆత్మనో యదియత్తీర్థం పూర్వోక్తేష్వేషు సమ్భవేత్ ॥ అనుజ్ఞాప్య ద్విజైస్స్నానం గత్వా పుణ్యోదకం తదా । నిమిత్తం కీర్తయిత్వాథ స్నానం మానసలమార్గతః ॥ త్రిసహస్రం చ ద్విశతం వింశత్యుత్తరమేవ చ । ఏతత్కృత్వా విశుద్ధాత్మా పరిషత్సన్నిధౌ తదా ॥ ఏతత్పాపవిశుద్ధ్యర్థం ప్రాయశ్చిత్తం ద్విజన్మనామ్ । నాన్యథా శుద్ధిమాప్నోతి జలధేనుప్రతిగ్రహాత్ ॥ పరిషత్సన్నిధౌ యథాశాస్త్రం పూర్వవత్కృత్వా పశ్చాత్స్నానాదికం కృత్వా పంచగవ్యం పీత్వా బ్రాహ్మణాన్భోజయేదితి ॥— ఇతి జలధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥—॥ అథ క్షీరధేనుప్రతిగ్రహ ప్రా

——*క్షీరధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్*——

యశ్చిత్తమాహ ॥—॥ స్కాందే ॥ పురావణ్ముఖరాక్షీర్థారమాజాతాసక్ష

నుకా । సవత్సాక్షీరసంపన్నా సర్వావయవసున్దరీ ॥ పోషయామాసజలధి ర్దుగ్ధధేనుంసవత్సకామ్।పురుషోత్తమాయలక్ష్మీంతాంప్రదదౌసర్వసాక్షిణే॥ సప్రాయచ్ఛత్సతాంధేనుంపుత్రీవాత్సల్యగౌరవాత్।యయాచేజలధింధేనుం వృత్రహాపాపమోచనీమ్ ॥ తథేతిప్రదదౌసింధుర్దదౌతస్మైత్రివాచికం ॥ తాందుగ్ధధేనుమాదాయ పునఃప్రాయాత్స్వమాలయం । ధిషణాయస్సవృత్తాన్తం కథయామాసదేవరాట్ ॥ పుణ్యకాలఉపాయాతేదుగ్ధధేనుంసపుత్రిణీం । దాపయామాసవిప్రాయ వృత్రహత్యావిముక్తయే ॥ తదాప్రభృత్యసాధేను బ్రహ్మహత్యావినాశినీ । రాజాయఃప్రదదౌధేను మర్చితాం కృష్ణచర్మిణీం ॥ సర్వపాపవినిర్ముక్తో విష్ణులోకమవాప్నుయాత్ ।యోవిప్రః స్వర్చితాంధేనుం నిర్మితాందుగ్ధరూపిణీం ॥ ప్రత్యగృహ్ణాద్ధనేలోభాత్సం ప్రాప్తేపుణ్యపర్వణి । సకాలవశమాపన్న స్తపనుభూయమహద్భయం ॥త ద్వంతేభువమాసాద్య మృతదారోభవేద్భువి ॥—॥ దేవీపురాణే ॥ పుణ్యకాలేషుపుణ్యర్క్షే పుణ్యక్షేత్రేజనాధిప । యోరాజాస్వర్చితాంధేనుం నిర్మితాందుగ్ధరూపిణీం ॥ విప్రాయవేదవిదుషే ప్రదద్యాత్సోపిముక్తిభాక్ ॥ ఏతాదృశీందుగ్ధమయీం ద్విజోనిష్కారణాద్గ్రహేత్ । తస్యేహనిష్కృతిర్నాస్తి పంచచాంద్రాయణాదృతే ॥ తతశ్శుద్ధిమవాప్నోతిదుగ్ధధేను ప్రతిగ్రహాత్ ॥—॥ లైంగే ॥ పుణ్యకాలేషురాజేంద్ర పుణ్యపర్వసువాద్విజః । దుగ్ధధేనుంప్రగృహ్ణీయాత్ వృథాభోగపరాయణః । తస్యైషానిష్కృతిర్దృష్టాపం చభిశ్చాంద్రభక్షణైః ॥ అథానయాగప్రాప్తౌన ప్రాయశ్చిత్తం ॥పంచగవ్య ప్రాశనమేవ ॥ తదాహ ॥—॥ కౌర్మే ॥ ద్విజోదుగ్ధమయీంధేనుం ప్రతిగృహ్యజనాధిపాత్ । యాగాదికంప్రకుర్వీత పంచగవ్యంపిబేత్తతః ॥ అకృత్వాద్రవ్యలోభేన హ్యశక్తఃపాపభీస్తదా । పంచచాన్ద్రాయణైశ్శుద్ధిర్నాన్యథాతీర్థసేవనైరితి ॥—॥ఇతిక్షీరధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తం॥—॥అథమ

## —*మధుధేనుప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్ *—

ధుధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥—॥ స్కాందే ॥ అథాపరం ప్రవక్ష్యామి ప్రాయశ్చిత్తంవిశుద్ధయే । మధుధేనుగృహీతౄణాం ద్విజానాంహితకామ్యయా । నిష్కారణప్రవృత్తానాంభోగేచ్ఛావాంశ్శృణుష్వమే। పుణ్య

కాలేషు సంక్రాన్తౌ వ్యతీపాతాదిసమ్భవే ॥ కల్పితాం స్వర్ణమయైః పాత్రైః రచితాం రాజవల్లభైః । మధుధేనుం సవత్సాం చ సర్వాలంకారభూషితామ్ ॥ గృహ్ణీయాద్యో ద్విజో లోభాత్ స సద్యః పాపమవాప్నుయాత్ । యమశాలాం ప్రవిశ్యాథ పునర్జన్మ నముపాగతః ॥ మధువృక్షో భవేత్సోఽపి యది తన్నిష్కృతిర్నచేత్ । కథం చిన్నిష్కృతిర్దృష్టా తేషాం పాపరతాత్మనామ్ ॥ పంచ చాంద్రాయణైశ్శుద్ధిర్నచాన్యైశ్శుద్ధిరీరితా ॥ క్షౌద్రధేనుః క్షుద్రజాతేర్ద్విజైర్న ప్రతిగృహ్యతే । దైవాద్యది హి లభ్యేత పంచభిశ్చాంద్రభక్షణైః ॥ శుద్ధిమాప్నోతి సర్వత్ర మధుధేనుప్రతిగ్రహాత్ । ఏతద్విప్రాత్ప్రతిగ్రహే ప్రాయశ్చిత్తం బాహుజేభ్యో ద్విగుణం । ఊరుజేభ్యస్త్రిగుణం । పాదజేభ్యశ్చతుర్గుణం । సంకరజాతిభ్యః పంచగుణం వేదితవ్యం ॥ తదాహ ॥—॥ బృహ్మకైవర్తేన ॥ ప్రాయశ్చిత్తం ద్విజాతిభ్యః ప్రతిగృహ్య కథంచన ॥ యావదుక్తం తదేవాలం బాహుజేభ్యో ద్విధా స్మృతం । ఊరుజేభ్యస్త్రిధా ప్రోక్తం పాదజేభ్యశ్చతుర్గుణం । ఏతేభ్యో వ్యతిరిక్తేభ్యః పంచధా పరికీర్తితం ॥ సర్వవర్ణేభ్యస్సర్వదాన ప్రతిగృహీత్రాణామేవం ప్రాయశ్చిత్తం వేదితవ్యం ॥ కలౌ యుగే సంకరజాతయో బహ్వ్యః । తత్ప్రతిగ్రహస్య నిషిద్ధత్వాత్ప్రాయశ్చిత్తబాహుళ్యముక్తం । ప్రాయశ్చిత్తవిహీనా ద్విజాః శ్లేష్మమధ్యస్థమక్షికావన్నానాజాతిషు సమ్భవన్తి ॥ అతః ప్రాయశ్చిత్తమేవ ప్రతిగృహీతౄణాం సాధనం నచాన్యత్ ॥ యస్య యస్య ప్రతిగ్రహస్య ధర్మశాస్త్రే ప్రతిపదోక్తం యద్యత్ప్రాయశ్చిత్తం తత్తత్కర్తవ్యం ద్విజన్మభిః ॥ నాన్యథా శుద్ధిరీరితేతి ॥—॥ ఇతి మధుధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తం ॥—॥ అథ శర్క-

## —*శర్కరాధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్*—

రాధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥—॥ మార్కండేయః ॥ ధేనుం శర్కరయా కృత్వా సవత్సామజినే శుభాం । యో రాజా ద్విజవర్యాయ దద్యాత్పుణ్యాగమే ముదా । అర్చితాం గన్ధపుష్పాద్యైః బహుభిర్భూషణైర్వృతాం । స గచ్ఛేద్విష్ణుభవనం యావదాచన్ద్రతారకం ॥—॥ శివధర్మోత్తరే ॥ కృత్వాఽజినేషు యో ధేనుం శర్కరాభిరలంకృతామ్ । అర్చితాం గంధపుష్పాద్యైర్విప్రాయాధ్యాత్మవేదినే ॥ దద్యాత్పుణ్యతమే కాలే తీర్థేషు గృహేషు చ ॥

నతస్యపునరావృత్తి ర్బ్రహ్మలోకాత్కదాచన ॥—॥ విష్ణుధర్మోత్తరే ॥ కృత్వాశర్కరయాధేనుం పుణ్యకాలేషుపర్వసు । దద్యాద్దక్షిణయాసార్ధం విప్రాయాధ్యాత్మవేదినే ॥ సనిస్తరతిసంసారం నావాబ్ధింనావికోయథా॥—॥ ప్రతిగ్రహేదోషమాహ ॥ మహానారదీయే ॥ యోగృహ్ణీయాద్ద్విజో ధేనుం పుణ్యాంశర్కరయాచితాం । పుణ్యకాలేషుతీర్థేషు ద్రవ్యలోభపరాయణః మహాంతంనరకంభుక్త్వా స్థావరత్వమవాప్నుయాత్ । తస్యైషానివృత్తిర్దృష్టా మునిభిఃబ్రహ్మవాదిభిః ॥ స్నాత్వాప్రాతర్యథాచారం దంతధావనపూర్వకం । విభూతింవిశ్వరూపంచ హుత్వార్ధ్వమూలమంత్రవరం । జపంస్త్రిషవణస్నానం కృత్వానిత్యమతంద్రితః । ఆసాయంప్రాతరారభ్య సంఖ్యయాగణయన్జపం ॥ ఫలాహారోత్రికర్తవ్యః స్వపేద్దేవసమీపతః । పునఃప్రాతస్సముత్థాయ పూర్వవజ్జపమాచరేత్ ॥ యదాభవేత్త్రియుతం తదాశుద్ధిమవాప్నుయాత్ । యద్దైవసద్గృహేద్ధేనుం శర్కరాయాఃపృథగ్ద్విజః ॥ తదాపాపాన్యనేకాని ప్రవిశంతిప్రతిగ్రహే । తత్పాపశోధనార్థాయ ప్రాయశ్చిత్తమిదంశుభం । ఆధానంవాప్రకుర్వీత యాగసాధనముత్తమం ॥ సర్వేషాంసప్తతంతూనా మాధానంప్రథమంవిదుః । వర్ణానాంచయథావిప్రో దేవానామపివాసవః । భృగుర్ఋషీణాంప్రవరో వాచాంసత్యంయథాభవేత్ ॥ తథైవసర్వయజ్ఞానా మాధానంమూలకారణం । ప్రాయశ్చిత్తమిదంవాపి హ్యాధానంవాద్విజశ్చరేత్ । తాభ్యాంపాపవినిర్ముక్తః ప్రయాతిపరమంపదం —ఇతి శర్కరాధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తం ॥—॥ అథదధిధేనుప్రతిగ్ర

—*దధిధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తం*—

హప్రాయశ్చిత్తమాహ ॥—॥ స్కాందే ॥ శృణుషణ్ముఖవక్ష్యామి దధిధేనుప్రతిగ్రహే । ప్రతిగృహీతుర్విప్రస్య దోషోభవతిసర్వదా । తద్ద్రవ్యత్యాగమాత్రేణ ఆధానంయజ్ఞమేవవా । కృత్వాశుద్ధిమవాప్నోతి కర్తాహర్తాజాయతేభువి ॥—॥ శివధర్మోత్తరే ॥ దధిధేనుమలంకృత్య గంధవస్త్రాదిభూషణైః । అభ్యర్చ్యవిధివద్భక్త్యా దద్యాద్యోవిప్రపుంగవే । నతస్యయమబాధాస్తి తద్గృహేవాప్రవేశనం । తద్దర్శనంవారాజేంద్ర నభవేజ్జన్మజన్మని ॥— బ్రహ్మకైవర్తే ॥ యోరాజాపుణ్యకాలేషు పుణ్యతీర్థేషుపర్వసు ॥ కృష్ణాజి

నైదధిమయీం ధేనుంకృత్వాసవత్సకాం ॥ అభ్యర్చ్యగంధవస్త్రైశ్చద్రవ్యైర్విప్రాయాధ్యాత్మవేదినే ॥ నతంమృత్యుర్‌రవాప్నోతి నవ్యాధిర్నచతస్కరః। అన్తేవిష్ణుపదంయాతి యావదింద్రాశ్చతుర్దశ । బాహుజోధేనుమారాధ్య దద్యాత్కృష్ణాజినేశుభాం । నతస్యపునరావృత్తి బ్రహ్మలోకాత్కదాచన ॥ ప్రతిగృహ్యద్విజోధేనుం రాజ్ఞఃపుణ్యాదినేష్వపి। ప్రాయశ్చిత్తంతదాకుర్యాత్పూర్వవద్ధనభాగతః॥ అథవాధానకంకర్మ యజ్ఞంవాసర్వదక్షిణం । ఋణనిర్మోచనంకుర్యాచ్ఛుద్ధస్స్యాత్తత్ప్రతిగ్రహాత్ ॥—॥ మాత్స్యే ॥ దధిభిస్తుకృతాం ధేను మర్చితాంసర్వభూషణైః । పూజితాంగంధపుష్పాద్యైః పుణ్యకాలేషుపర్వసు ॥ తీర్థేషుదేవఖాతేషు ప్రతిగృహ్యద్విజోయది । అకృత్వానిష్కృతింతస్య సభవేద్దుంధమాషకః ॥—॥ దేవీపురాణే॥ తద్దోషోపశమంరాజన్ శృణుసర్వంప్రయత్నతః । ప్రాతస్స్నాత్వానదీతోయే నిత్యకర్మసమాప్యచ ॥ నిత్యహోమంచకుర్వీత వృక్షమూలముపాశ్రితః । కృత్వారుద్రజపంతత్ర యావదస్తమయోభవేత్ ॥ తదావిరమ్యామనసాఫలాహారంసమాచరేత్ । గృహంగత్వాస్వపేత్తాత నారాయణమనుస్మరన్ ॥ పునఃపరేద్యురుత్థాయ పూర్వవజ్జపమాచరేత్ । త్ర్యహ్నయుతంపూర్ణంలా మేతిలావత్పారణమాచరేత్ ॥ అశక్తోసులభం తాత ఆధానంయజ్ఞమేవవా । తతశ్శుద్ధిమవాప్నోతి విప్రోధేనుప్రతిగ్రహాత్ ॥—॥ ఇతి దధిధేను ప్రతిగ్రహప్రాయశ్చిత్తం ॥—॥ అథేక్షురసధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥—॥

—*ఇక్షురసధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తం*—

వామనపురాణే ॥ యోరాజాపుణ్యకాలేషు ధేనుమిక్షురసోద్భవాం । అర్చితాంగంధపుష్పాద్యైః భూషితాంసర్వభూషణైః ॥ విప్రాయవేదవిదుషే శాన్తాయాథకుటుంబినే । దద్యాద్దక్షిణయాసార్ధం సరాజావిష్ణుమందిరం ॥ గత్వాస్థిత్వాచిరంకాలం భూమండలపతిర్భవేత్ । తత్రాపిజ్ఞానమాసాద్య దానధర్మపరాయణః ॥ కృత్వాధర్మానశేషేణ విష్ణుసారూప్యతాంవ్రజేత్ ॥—॥ మహాభారతే ॥ శృణుధర్మంప్రవక్ష్యామి ధేనుమిక్షురసోద్భవాం అర్చితాంశాస్త్రమార్గేణ భూషితాంబహుభూషణైః ॥ పుణ్యకాలేషు సంక్రాన్తా వయనద్వితయేతథా । అర్ధోదయేమహాపుణ్యే గ్రహణేచన్ద్ర

సూర్యయోః ॥ రచయిత్వాజినే సమ్యగ్విప్రాయాభ్యర్చ్య వేదినే । దక్షిణాభి
శ్చ బహ్వీభిర్దద్యాత్సుప్లానమానో యదా ॥ తదా వైకుంఠమాప్నోతి పునరావృ
త్తివర్జితం ॥—॥ నృసింహపురాణే ॥ కల్పితాం రాజపురుషైరిక్షూణాంపక్వ
రసేనతాం । అర్చయిత్వా విధానేన హ్యర్చితాయ ద్విజన్మనే ॥ దక్షిణా
భిర్యథోక్తాభిర్దద్యాన్మనసి నిస్పృహః । తస్య దేవః ప్రసన్నః స్యాత్ప్రహ్లా
దాయ యథా పురా ॥—॥ తత్ప్రాయశ్చిత్తమాహ బ్రహ్మాండే ॥ పూర్వజో
బాహుజాద్ధృత్వా ధేనుమిక్షురసోద్భవాం । అకృత్వా నిష్కృతిం పశ్చాద్దా
ధానం వా క్రతుం తథా ॥ యమలోకముపాగమ్య నరకానేకవింశతిం । అను
భూయ సపాపాత్మా గోమాయుర్భవతి క్షితౌ ॥—॥ మాత్స్యే ॥ విప్రో
ధేనుం రసమయీం దత్తాం రాజసమార్జకైః । గృహీత్వా పుణ్యకాలేషు తన్ని
ష్కృతిపరాఙ్ముఖః ॥ యాగాదికం పరాకృత్య గోమాయుర్భవతి ధ్రువం ॥
తస్యైషా నిష్కృతిర్దృష్టా విష్ణునా ప్రభవిష్ణునా ॥ ప్రాతరారభ్య మేధావీ
స్నాత్వా నిత్యం సమాప్య చ । వృక్షమూలముపాగమ్య పఠేదుపనిషత్త్రయం ॥
సంఖ్యాం సముద్వహన్సమ్యగ్యావదస్తంగతో రవిః । తావజ్జపాద్విరమ్యాథ
ఫలాహారం సమాచరేత్ ॥ స్వపేద్దేవసమీపే తు కృతం పాపమనుస్మరన్ । పరే
ద్యుః ప్రాతరుత్థాయ పూర్వవజ్జపమాచరేత్ ॥ ద్వ్యయుతంపూరణాత్తామే
తి తతశ్శుద్ధిమవాప్నుయాత్ । ఏతత్ప్రాయశ్చిత్తం యాగాద్యకరణవిషయం
తత్ప్రాప్తౌ పంచగవ్యమాత్రం ప్రాయశ్చిత్తం ॥—॥ ఇతీక్షురసధేనుప్రతిగ్ర

## —*సాక్షాద్ధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తం*—

హప్రాయశ్చిత్తం ॥—॥ అథ సాక్షాద్ధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ—
మాత్స్యే ॥ ఏతాః షోడశ ధేనూనాం ప్రత్యక్షాః పాపనాశినీ । మహాపాపవిశు
ద్ధ్యర్థం బ్రహ్మణా నిర్మితా పురా ॥ రాజా వా విప్రముఖ్యో వా దశనిష్కాధిపో
పి వా । ధేనుమేకామలంకృత్య హ్యభ్యర్చ్య విధిపూర్వకం ॥ పుణ్యకాలేషు
పుణ్యర్క్షే యో దద్యాద్విప్రపుంగవే । స యాతి విష్ణుభవనం దేవైస్సహ నరాధి
ప ॥—॥ లైంగే ॥ ధేనుం యస్సమలంకృత్య పుణ్యకాలేషు పర్వసు । అభ్య
ర్చ్య గంధపుష్పాద్యైర్యో దద్యాద్విప్రపుంగవే ॥ స యాతి బ్రహ్మణః స్థానం య
త్ర గత్వా న శోచతి । పశ్చాద్భువముపాగమ్య స భవేన్మండలాధిపః ॥—॥ మ

హారాజవిజయే ॥ ధేనుమేకామలంకృత్య పుణ్యకాలేషుపర్వసు । పుణ్యక్షే
త్రేపుణ్యదినే వ్యతీపాతేచవైధృతౌ ॥ యోదద్యాద్విప్రవర్యాయ సయాతిప
రమాంగతిం । పునర్భువముపాగమ్య రాజాభవతిధార్మికః ॥—॥ స్కాన్దే ॥
ధేనుంవిప్రోనుగృహ్ణీయాద్యథాభోగపరాయణః । అకృత్వానిష్కృతింలో
భాద్వ్యాళీభవతికాననే ॥ తద్దోషపరిహారార్థం జపేన్మంత్రమథాయుతం
తదాదోషవినిర్ముక్తశ్శుద్ధిమాప్నోత్యనుత్తమాం ॥—॥ భవిష్యోత్తరే ॥ యో
ధేనుంసమలంకృత్య దశధేన్వనుయాయినీం । గన్ధపుష్పాక్షతైర్వస్త్రైస్స్వర్ణా
భరణభూషితామ్ ॥ దత్తాంరాజకుమారేణ పుణ్యకాలేషుపర్వసు । ప్రతి
గృహ్యాద్ద్విజోలోభాదకృత్వానిష్కృతింశుభాం ॥ వ్యాళీభవతిమష్టాన్నాయా
గంవాదానమేవవా । ఏతత్పాపవిశుద్ధ్యర్థం రుద్రంద్వ్యయుతముచ్యతే ॥
ఉపక్రమ్యతదానీంవా పరేద్యుర్వాపరేహని । స్నాత్వాప్రాతర్యథాచారం
నిత్యకర్మసమాప్యచ ॥ రహస్థానంసమాగమ్య సంఖ్యాంమనసిధారయన్ ।ఆ
రభ్యచోదయాద్భానో రస్తమేతిదివాకరః ॥ విరమ్యనియమంపశ్చాత్ఫలా
హారంప్రకల్పయేత్ । స్వపేద్వాస్వగృహేదేవ సమీపేస్థండిలేవ్రతీ ॥ పరే
ద్యురేవంకుర్వీతయావత్సంఖ్యాసమాప్యతే । తతశ్శుద్ధిమవాప్నోతి యజ్ఞదాన
పరాఙ్ముఖః ॥—॥ ఇతిసాక్షాద్ధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తం ॥—॥ అథార్ద్ర

—*ఆర్ద్రకృష్ణాజినప్రతిగ్రహప్రాయశ్చిత్తం*—

కృష్ణాజినప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥—॥ స్కాందే ॥ శృణుపుత్రప్ర
వక్ష్యామి ఆర్ద్రకృష్ణాజినంశుభం । తిలైరాపూర్యతచ్చర్మ దద్యాద్విప్రాయ
ధీమతే ॥ సనరఃపాపనిర్ముక్తో బ్రహ్మలోకంసమశ్నుతే । పశ్చాద్భువముపా
గమ్య సప్తజన్మభవేద్ద్విజః ॥ తత్రాధీత్యశ్రుతింసమ్యగ్బ్రహ్మజ్ఞానమవాప్యచ
తేనజ్ఞానేన మహతా నిర్వాణంసమవాప్నుయాత్ । సూర్యసోమగ్రహే
రాజన్ మన్వాదిషుయుగాదిషు । అయనద్వితయేచైవ వ్యతీపాతేచవైధృతౌ
సంక్రమేషుచజన్మర్క్షే నదీతీరేసురాలయే । స్వగృహేవాపిరాజేంద్రపుణ్య
క్షేత్రేషుపర్వసు । నరోయస్సమ్యగభ్యర్చ్య ఆర్ద్రకృష్ణాజినందృఢమ్ ॥తిల
పూర్ణంద్విజేంద్రాయ హ్యర్చితాయసుభూషణైః । దద్యాద్దక్షిణయాసా
ర్ధం తస్యపుణ్యఫలంశృణు ॥ యావంత్యజినరోమాణి యావంతస్తత్రవైతి

లాః । తావద్వర్షసహస్రాణి బ్రహ్మలోకమవాప్నుయాత్ ॥—॥ లిఙ్గపురాణే ॥ తిలపూర్ణంపుణ్యకాలే ఆర్ద్రకృష్ణాజినంనరః। అభ్యర్చ్యగంధవస్త్రా ద్యైస్సమ్యక్పుష్పాక్షతాదిభిః ॥ యోదద్యాద్విప్రవర్యాయ సగచ్ఛేద్వైష్ణవంపదమ్ ॥—॥ తత్ప్రతిగ్రహదోషప్రాయశ్చిత్తమాహ ॥ స్కాందే ॥ ఆర్ద్రకృష్ణాజినంరాజ్ఞః పుణ్యకాలఉపాగతే । యోవిప్రఃప్రతిగృహ్ణీయాత్స సద్యఃపతితోభవేత్ ॥ నిత్యంనైమిత్తికంకామ్యం యాగాదికమనంతరం । తదానశ్యంతికర్మాణి గాయత్రీజపఏవచ ॥ యమలోకముపాగమ్య భుక్త్వా తత్రమహద్భయమ్ । సపాపీభువమాసాద్య నారీత్వంసప్తజన్మసు ॥—॥ చతుర్వింశతిమతే ॥ యోవిప్రఃపుణ్యకాలేషు కృత్తిమార్ద్రాంతిలైర్యుతాం । తాంద్విజఃప్రతిగృహ్ణీయాద్వైధాభోగపరాయణః ॥ తదానశ్యంతికర్మాణి ఇష్టాపూర్తాదికానిచ । తదామృత్యువశంయాతి పుణ్యభ్రంశాద్యమాలయే ॥ మహాంతంనరకంభుక్త్వా స్త్రీజన్మతదనంతరమ్ ॥ ప్రాప్నోతీతిశేషః ॥—॥ బ్రహ్మాండే ॥ తిలపూర్ణంపుణ్యకాలే చర్మార్ద్రంరాజవల్లభాత్ । ప్రతిగృహ్య ద్విజోమోహాత్సత్తంతు పరాఙ్ముఖః ॥ యమలోకముపాగమ్య చిరంనరకభాక్తతః । నానాజన్మానుభూయాశు కృకలాసోభవేద్భువి ॥ తస్యైవాని ష్కృతిర్దృష్టా మునిభిర్బ్రహ్మవాదిభిః। అపమృత్యూత్తారణమార్జనంపూర్వవత్కృత్వాతదనంతరం ప్రాయశ్చిత్తమ్ ॥ ప్రాతస్స్నాత్వాతిలైస్సమ్యగఘమర్షణపూర్వకమ్ । ఆర్ద్రవాసాస్తటంగత్వా హ్యనుజ్ఞాప్యద్విజన్మనః ॥ ప్రతిగ్రహవిశుద్ధ్యర్థం తంతుమర్హథసజ్జనాః । ఇతిప్రార్థ్యద్విజాన్ సర్వాన్పరిక్రమ్యప్రణమ్యచ ॥ తప్తకృచ్ఛ్రత్రయంకృత్వా శుద్ధిమాప్నోత్యనుత్తమామ్ ॥ ప్రాయశ్చిత్తేనపూతాత్మా పునస్సంస్కారమాచరేత్ పంచగవ్యంపిబేత్పశ్చాచ్ఛుద్ధోభవతిలౌకికః ॥ కృచ్ఛ్రాచరణేన ప్రాయశ్చిత్తంపునఃకర్మపూర్వకంకృత్వా తదంగప్రాయశ్చిత్తేన పూతోభూత్వా యాగాదికంకుర్యాత్ ॥ అన్యథాపునఃకర్మాసంభవేయాగాదికంనఫలతి । పునఃకర్మైవహ్యాచార్యత్విజాంసర్వకర్మసాధనమ్ । నోచేన్మలముష్టిప్రక్షాళనవత్ ॥ అతఃపునః కర్మైవ బలవత్తరం ॥—॥ ఇత్యార్ద్రకృష్ణాజినప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥—॥ అథతిలకృష్ణాజినప్రతిగ్రహప్రాయశ్చిత్త

## —*తిలకృష్ణాజినప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్*—

మాహ ॥—॥ మార్కండేయః ॥తిలైరాపూర్య యశ్చర్మ దద్యాత్పుణ్యాగమే నృప । నతస్య యమలోకోఽస్తి వైకుంఠే వాసమశ్నుతే ॥—॥ కౌర్మే ॥ పుణ్యకాలే పుణ్యదినే సాంగే కృష్ణాజినే తిలాన్ । నిక్షిప్య విప్రవర్యాయ యోదద్యాత్సతు పుణ్యభాక్ ॥—॥ స్కాందే ॥ పూర్వవత్తిలసంయుక్తం శుభం చర్మ ద్విజాతయే । పుణ్యకాలేషు పుణ్యాహే యోదద్యాత్సోఽపి వైహరిః॥అజినం యోను గృహ్ణీయాచ్ఛుభం విప్రస్తిలైర్యుతమ్ ।అపమృత్యుమవాప్నోతి నారీత్వం ప్రాప్నుయాదిహ ॥—॥ దానసాగరే ॥ పుణ్యకాలేషు పుణ్యాహే పుణ్యతీర్థే నృపోత్తమ । తిలకృష్ణాజినం ధృత్వా వృథా భోగపరాయణః ॥యమలోకమవాప్నోతి స్థిత్వా భుంజన్మహద్భయం । పునర్నారీత్వమాప్నోతి తిలచర్మ ప్రతిగ్రహే ॥ ఆర్ద్రకృష్ణాజినే పూర్వం ప్రాయశ్చిత్తం ప్రదర్శితమ్ ।పాదహీనం ద్విజః కుర్యాత్తిలకృష్ణాజినగ్రహే ॥ పాదహీనం పంచోత్తరసప్తతితప్తకృచ్ఛ్రాణి కృత్వా పునస్సంస్కారం పూర్వవత్కృత్వా శుద్ధిమాప్నోతి నాన్యథేతి ॥—॥ ఇతి తిలకృష్ణాజినప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥—॥ అథయోగ

## —*యోగవ్రతాదిషు కృష్ణాజిన ప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్*—

వ్రతాదిషు కృష్ణాజిన ప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥—॥ మాత్స్యే ॥అర్ధనారీశ్వరే యోగే యోగే హరిహరాత్మకే । లక్ష్మీనారాయణే యోగే వ్రతేష్వన్యేషు షణ్ముఖ ॥కృష్ణాజినే వ్రతాంగత్వాన్న దోష ఇతి గోభిలః। తథాపి శృణు వక్ష్యామి ప్రాయశ్చిత్తం విశుద్ధిదం ॥—॥ మహానారదీయే ॥ యోగేషు వ్రతకాలేషు అర్ధనారీశ్వరాదిషు । యో దద్యాదజినం విప్రే వ్రతం తస్య ఫలప్రదం ॥పురా నారాయణో దేవో లోకాన్సంహృత్య చాత్మని । నిధాయ జలధౌ శిశ్యే దీర్ఘకాలమరిందమః ॥ తన్నాభౌ శైవలం జజ్ఞే తత్రాభూత్పంకజం మహత్ । హిరణ్మయం బృహన్నాళం రక్తకుంకుమకేసరం ॥ సహస్రపత్రం తరుణం ప్రతప్తకనకోజ్జ్వలం । తత్రజజ్ఞే విధాతా చ వ్యస్రాక్షీజ్జగతాం పతిం ॥ హరిః ప్రసన్నవదనో బభాషే కమలాసనం । సృజ విశ్వమిదం భద్ర వేదాన్యజ్ఞాన్ ద్విజానపి ॥ ధేనుం చ లోకరక్షార్థం మా లస్యం మా కురు ద్రుహ। ఇత్యుక్త్వా భగవాన్విష్ణుస్తత్రైవాంతరధీయత ॥ బ్రహ్మా తదవధార్యాథ సృష్టవా

న్విశ్వమోజసా । వేదాన్యజ్ఞాన్ ద్విజాన్గాశ్చ తన్మంత్రాంస్తత్రసాధకాన్ ॥ అరణింస్రుక్స్రువౌదర్వీం ధ్రువాం జుహూంతదాయుధం । కృష్ణాజినం చ ముసలము లూఖలమతఃపరం ॥ పాత్రాణ్యన్యానివిశ్వాత్మా ససర్జ జగదీశ్వరః । వ్రతేషుయ జ్ఞదానేషు బ్రహ్మచర్యవ్రతాదిషు ॥ అజినం దానపూర్త్యర్థం దశావిప్రే భ్య ఆదరాత్ । తదాప్రభృత్యదశ్చర్మ ప్రసిద్ధిమగమద్భువి ॥ యస్త్వేతచ్చర్మ దానేషు వ్రతేషు నియమేషు చ । ప్రధానంకురుతే సోపి బ్రహ్మనిర్వాణమాప్ను యాత్ ॥ తత్ప్రతిగ్రహే ప్రాయశ్చిత్తమాహ ॥—॥ మార్కండేయః ॥ యో గాదిషు వ్రతేష్వేతత్ప్రతిగృహ్య ద్విజోత్తమః । ప్రాయశ్చిత్తంతదాకుర్యా త్పునస్సంస్కారవర్జితం ॥ దశాయుతానిగాయత్రీ రథనారీశ్వరేవ్రతే ॥ తథాహరిహరేయోగే లక్ష్మీనారాయణే తథా ॥ ఉగ్రవ్రతేషు దానేషు పుంవం ధ్యత్వహరాదిషు । ఏతేషు వ్రతేషు కృష్ణాజినానామంగత్వాల్లఘుప్రాయశ్చిత్త ముక్తం ॥ ఆద్యే కృష్ణాజినాదేస్స్వయం ప్రధానత్వాత్ప్రాయశ్చిత్తబాహు ళ్యం ॥ పునస్సంస్కారశ్చ ॥ ఏతేషు నోభయం । ఉక్తప్రాయశ్చిత్తమేవాలం ॥ ఇతి యోగాదిషు కృష్ణాజిన ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తం ॥—॥ అథ తిలపద్మప్ర

—*తిలపద్మప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్*—

తిగ్రహప్రాయశ్చిత్తమాహ ।—॥ స్కాందే ॥ యో రాజా పుణ్యకాలేషు పు ణ్యతీర్థేషు పర్వసు । తిలపద్మం యథాశాస్త్ర మర్చయిత్వ ద్విజన్మనే ॥ ద ద్యాద్దక్షిణయా సార్థం తస్యాఘ్నో నైవ విద్యతే । పునర్భూమముపాగమ్య మం డలాధిపతిర్భవేత్ ॥ —॥ బ్రహ్మకైవర్తే ॥ తిలపద్మం ద్విజో ధృత్వా రా జ్ఞః పుణ్యాదినేషు యః । సతు దేహవిశుద్ధ్యర్థం షడబ్దం కృచ్ఛ్రమాచరేత్ ॥ పునస్సంస్కారపూతాత్మా శుద్ధిమాప్నోతి దైహికీమ్ ॥—॥ లైంగే ॥ ప్రతి గృహ్య ద్విజో లోభా ద్భాగ్యేష్ణాపరాయణః । తిలపద్మం సముత్సృష్టం రాజ భిః పుణ్యసంగమే । పునః కర్మ ప్రకుర్వీత తతః పశ్చాచ్ఛృణుష్వమే ॥ సమ్యా గ్విప్రైరనుజ్ఞాత షడబ్దం కృచ్ఛ్రమాచరేత్ । తతః పాపవిముక్తస్స్యాన్నదా నైర్నాన్యకర్మభిః ॥ ద్విజోలోభపరాయణోభోగేచ్ఛయా తిలపద్మం ధృత్వా పూర్వం పునస్సంస్కారం కృత్వా పశ్చాత్పరిషదుపస్థానపూర్వకం ప్రాజాప పత్యకృచ్ఛ్రాణాం షడబ్దమాచరేత్ । తేనపూతోభవతి । నదానైర్నాన్య

కర్మభిః పూతస్స్యాత్ ॥—॥ ఇతి తిలపద్మప్రతిగ్రహప్రాయశ్చిత్తం ॥—॥ అ

## —*రజతపద్మప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్*—

థ రజతపద్మప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥—॥ మార్కండేయః ॥ కమ
లం రాజతం దద్యాద్యో రాజా పుణ్యసంగమే । అభ్యర్చ్య విధినా శాస్త్రీ ద్వి
ప్రాయాధ్యాత్మవేదినే ॥ నతస్య పునరావృత్తిః బ్రహ్మలోకాత్కదాచన ॥—
శైవే ॥ నిష్కామనతయా రాజన్ శుద్ధిస్స్యాద్ధరిణావ్యయమ్ । హరం వా ద్విజవ
ర్యాయ దద్యాత్పుణ్యాగమే సుధీః ॥ సర్వపాపవినిర్ముక్తః పుత్రపౌత్రపరిష్కృ
తః । ఇహైవ విపులాన్భోగాన్భుక్త్వా దేవపదం వ్రజేత్ ॥—॥ చతుర్వింశతిమ
తే ॥ యో ధృత్వా రాజతం పద్మం పుణ్యకాలేషు రాజభిః । దత్తం సర్వ్యాగలం
కృత్య తస్య శుద్ధిరనుత్తమా ॥ ప్రధానం సంపరిత్యజ్య కృత్వా చాంద్రాయణ
ద్వయం । శుద్ధిమాప్నోతి మహతీమేతత్పద్మప్రతిగ్రహాత్ ॥ ఆధానం వా బ్రా
హ్మణం తీర్త్వా తేన విప్రో నదోషభాక్ । ఆధానకరణే సర్వస్వదక్షిణే ప్రాయశ్చి
త్తం పంచగవ్యప్రాశనం ॥—॥ ఇతి రాజతపద్మప్రతిగ్రహప్రాయశ్చిత్తం ॥

## —*రోగప్రతికృతిప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్*—

అథ రోగప్రతికృతిప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥—॥ స్కాందే ॥ క్షయః
కాసశ్చ గుల్మశ్చ శిరోవాయుర్భగందరః । అశ్మరీరోగస్తథా శూలం గండ
మాలా శిరోభ్రమః ॥ ఏతే మహాపాతకజన్యాః ॥ వాతవ్యాధ్యశ్మరీకుష్ఠమ
హోదరభగందరాః । అర్శాంసి గ్రహణీత్యష్టౌ మహారోగాః ప్రకీర్తితాః ॥
ఇత్యేతే ఉపపాతకజన్యాః ॥ ప్రమేహో మధుమేహశ్చ జ్వరశ్శీతోష్ణసంభవః ।
కంపశ్చ పక్షఘాతశ్చ ఆంత్రవృద్ధిస్తథైవ చ ॥ ఇత్యేతే సంకలీకరణజన్యాః ॥
అరుచిశ్చ తథా పిత్తం బహుమూత్రం శిరోవ్రణం । సర్వాంగతాపనం తద్వద్బ
ధిరత్వమనగ్నితా ॥ ఇత్యేతే మలినీకరణజన్యాః ॥ అక్షిశూలం కర్ణశూలం
పాదశూలం తథాంగులం । కండూతిర్దర్దురో లోగః కామిలా చ తథా భ్ర
మః ॥ ఇత్యేతేఽపాత్రీకరణజన్యాః ॥ నక్తాంధత్వం గుదశూలం నాసారోగ
స్తు జృంభితం । హిక్కా క్షుతమజీర్ణత్వం కంఠశోషణమేవ చ ॥ ఇత్యేతే జా
తిభ్రంశజన్యాః ॥ ఏతే చాన్యే చ బహవో వ్యాధయః పాపసంభవాః । ఇహ జన్మ
ని వా రాజన్ పూర్వజన్మని వార్జితాః ॥ వ్యాధయః పాపమూలాస్స్యుః ప్ర

త్యక్తునరకాన్త్స్వమీ । సర్వవ్యాధ్యుపశాంత్యర్థం కుర్యుఃప్రతికృతింబుధాః॥ బ్రహ్మహత్యాదిరోగనిరాసార్థంయస్యయస్యపాపస్య రోగోయోరోగోజాతః తన్నిరాసార్థంప్రధానదేవతా స్తికర్మవిపాకేషూపైవప్రతికృతిః ॥ తత్ప్రతిగ్రహేద్విప్రస్య పాపబాహుళ్యమ్ ॥ తస్మాత్కర్తవ్యంప్రాయశ్చిత్తమ్ ॥ తత్ప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥—॥ వామనపురాణే ॥ కృష్ణాజినంప్రతికృతిం మేషీంచోభయతోముఖీం । శకటంయోనుగృహ్ణాతి నభూయఃపురుషోభవేత్ ఏతదకృతయాగాదికస్యాకృతప్రాయశ్చిత్తస్యవిషయే ॥ ఉభయోరేకతరాసంభవేస్త్రీత్వం ॥—॥ తదాహమార్కండేయః ॥ ద్విజఃప్రతికృతింధృత్వా యాగంవానికృతింతువా । అకృత్వాద్రివ్యలాభేన సస్త్రీభవతిసర్వదా ॥ తత్ప్రాయశ్చిత్తమాహ ॥—॥ కూర్మపురాణే ॥ ధృత్వాప్రతికృతింవిప్రః సప్తతంతుపరాఙ్ముఖః । తత్ప్రతిగ్రహశుద్ధ్యర్థం కుర్యాచ్చాంద్రాయణత్రియమ్ ॥ నిరంతరమహోరాత్రం జపన్నారాయణంవిభుమ్ । స్వాపేచ్ఛదేవతాగారే స్థండిలేకేవలేవసన్ ॥ కబళంభక్షయేత్రాత రవిర్మందాయతేయదా । ఏవంమాసత్రయేపూర్ణే శుద్ధస్స్యాత్తత్ప్రతిగ్రహాత్ । ఆధానంవాప్రకుర్వీత ఋణనిర్మోచనంతువా ॥ ద్వయోరభావేలాభార్ధే ప్రాయశ్చిత్తమిదంచరేత్ । తత్రాపిచపునఃకర్మ శుద్ధిమాప్నోతినాన్యథేతి ॥—॥ ఇతి రోగప్రతికృతి ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తం ॥—॥ అథమృతశయ్యాప్రతిగ్రహ

## —※మృతశయ్యాప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్※—

ప్రాయశ్చిత్తమాహ ॥—॥ కూర్మపురాణే ॥ జనస్యమరణేకాలేయముదూతగణైస్సహ । పాపానితస్యయావన్తిసంఘీభూయవ్రజంత్యథః ॥ భూతప్రేతపిశాచాద్యా మృతశయ్యాబహిస్థితాః । కేచిద్దృష్టిపథంయాతాః కేచిత్ప్రేతంశపంత్యలం । మ్రియమాణంతతోదృష్ట్వా కుత్సయన్తితథాపరే । మరణాంతేయథారాజన్ శయ్యాస్పృశ్యానసాజనైః । తత్పుత్రాదిస్తతాంశయ్యాం విప్రాయాధ్యాత్మవేదినే ॥ ద్వాదశేదివసేదద్యాన్మృతస్స్వర్గమవాప్నుయాత్ । బహ్వీభిర్దక్షిణాభిశ్చ తోషయేద్విప్రవల్లభం ॥ తత్ప్రతిగ్రహదోషమాహ ॥—॥ మాత్స్యే ॥ విప్రోలోభపరీతాత్మా మృతతల్పం పరిగ్రహేత్ । నిత్యంనైమిత్తికంకామ్యం సద్యఃక్షరతిసర్వథా । నిత్యనైమి

త్తికాభావాత్పతితస్స్యాద్ద్విజాధమః । గర్భాధానాదిసంస్కారాః పునః
కార్యాద్విజాతిభిః ॥ తతఃపరం చరేత్కృచ్ఛ్రం ద్విశతం తప్తసంజ్ఞకమ్ ।
తతఃపూతోభవత్యేవ కర్మార్హోలోకయోర్ద్వయోః ॥ అన్యథానిష్కృతిర్నా
స్తిహ్యాధానక్రతుభిర్వినా । ప్రధానం సమ్పరిత్యజ్య ప్రాయశ్చిత్తం స
మాచరేత్ ॥ అన్యథాస్యాత్సదుష్టాత్మాపచ్యాలూకో నిర్జనే వనే । ఏతద్వ్యాగ
ప్రాయశ్చిత్తాద్యకరణవిషయమ్ ॥ ఉభయోరేకతరసమ్భవేనోలూకత్వమ్ ॥
— ॥ ఇతి మృతశయ్యాప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥ — ॥ అథ గోచర్మ

※శ్రీ※గోచర్మప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్※శ్రీ※

ప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥ —లిఙ్గపురాణే ॥ గోచర్మవిప్రవర్యా
య రాజా ధర్మపరాయణః । పుణ్యకాలఉపాయాతే దద్యాద్దక్షిణయా స
హ ॥ యావన్తఃపాంసవో భూమే రాశీభూతాభవన్తిహి । తావద్యుగస
హస్రాణి విష్ణులోకే మహీయతే ॥ గోచర్మప్రమాణమాహ ॥ — ॥ రఙ్గ
రాజీయే ॥ గోశతస్య సవత్సస్య సఞ్చారస్స్వచ్ఛయా భవేత్ । సతుద్వా
దశధా యాతో గోచర్మేతి విదుర్బుధాః ॥ — ॥ కౌర్మే ॥ అనర్గళతయారా
జన్ సఞ్చారో గోశతస్యచ । రాత్రౌ యావత్ప్రదేశేస్యాత్సవత్సస్య నృ
పోత్తమ ॥ సతు ద్వాదశమానేన గోచర్మేతి ప్రకీర్తితమ్ । తం దేశం విప్ర
వర్యాయ అర్చితాయ కుటుమ్బినే ॥ యాగాసక్తాయయోదద్యాత్సవైనారా
యణస్స్మృతః । పునర్భువముపాగమ్య మణ్డలాధిపతిర్భవేత్ ॥ — ॥ లిఙ్గపు
రాణే ॥ పుణ్యకాలేషు పుణ్యర్క్షే వ్యతీపాతేచ వైధృతౌ । నదీతీరే పుణ్యది
నే మన్వాదిషు యుగాదిషు ॥ అర్చితాయ ద్విజాగ్య్రాయ కర్మనిష్ఠాయశీలి
నే । యో రాజా చర్మతద్దద్యాత్సవై విష్ణుమవాప్నుయాత్ ॥ — ॥తత్ప్ర
తిగ్రహే దోషప్రాయశ్చిత్తే దర్శయతి ॥ స్కాన్దపురాణే ॥ గోచర్మద్రవ్య
లోభేన యోవిప్రస్సమ్ప్రతిగ్రహేత్ । పుణ్యకాలే పుణ్యదినే దత్తం రా
జ్ఞానువర్తినా ॥ సద్యఃపతన్తి రాజేన్ద్రసత్క్రియాఃకాయసమ్భవాః । నిత్య
కర్మపరిభ్రంశాత్సూకరత్వమవాప్యతే ॥ తస్యాన్యా నిష్కృతిర్నాస్తి యా
గేభ్యస్తత్ప్రతిగ్రహే । తదభావే నరశ్రేష్ఠశతచాన్ద్రాయణం చరేత్ ॥
— ॥ త్రయస్త్రింశన్మతే ॥ పూర్వజఃప్రతిగృహ్ణీయాద్రాజదత్తం సుపూ

జితమ్ । గోచర్మేతి భువస్థానం స్త్రీవ్యలోభేన పార్థివ ॥ తస్య కర్మాణి నశ్యన్తి మృత్యూరాయాతి తత్క్షణాత్ । నరకానుభవం కృత్వా సూకరో భవతి క్షితౌ ॥ బహుసంస్కారపూతేభ్యో యాగాదిభ్యోఽథ నివర్త్యతః । తస్యోపనయనం భూయః కర్మభిశ్శాస్త్రవేదితః ॥ కృచ్ఛ్రాతిచరణపూర్వకముపనయనాదికం కృత్వా పశ్చాద్యాగాదికర్తవ్యః ॥ తదభావే చాన్ద్రాయణశతం కృత్వా దణ్డమేఖలాశ్మస్థాపనాదికం వర్జయిత్వా కల్పోక్తవిధినా సర్వం కుర్యాత్ ॥ నాన్యథా శుద్ధిరీరితేతి ॥ — ॥ ఇతి హేమాద్రౌ గోచర్మప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥ — ॥ అథ శకటదానప్రతిగ్రహప్రాయశ్చిత్తమా

## శ్రీ* శకటదానప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ *శ్రీ

హ ॥ — ॥ మత్స్యపురాణే ॥ స్థితే కర్కటకే భానౌ మకరస్థే దివాకరే। మాఘమాసే పూర్వపక్షే సప్తమ్యాం రవివాసరే ॥ అయనద్వితయే చైవమన్వాదిషు యుగాదిషు । శకటం ధాన్యసమ్మిశ్రం యుగరజ్జుపరిష్కృతమ్ ॥ చతుర్భిరనడుద్భిశ్చ యుక్తం వస్త్రైరలఙ్కృతమ్ । యోదద్యాద్విప్రవర్యాయ నతస్య పునరుద్భవః ॥ — ॥ స్కాన్దే ॥ తీర్థేషు పుణ్యకాలేషు పుణ్యవత్సు దినేష్వపి । యో రాజా శకటం దద్యాద్విప్రాయాధ్యాత్మవేదినే ॥ అనడుద్యుగసంయుక్తం రజ్జుధాన్యపరిష్కృతమ్ । అర్చితం గన్ధవస్త్రాద్యైరుక్తదక్షిణయాసహ ॥ సూర్యలోకమవాప్నోతి కులత్రయసమన్వితః । తదన్తే భువమాసాద్య సర్వసస్యసమృద్ధిమాన్ ॥ దానైరన్యైః పూతాత్మా నిర్వాణముపపద్యతే । శకటే ధాన్యాదినిర్మాణప్రకారస్తు పరిభాషాయామభిహితః ॥ — ॥ నారదీయే ॥ శకటం పుణ్యకాలేషు యో రాజా పృథివీతలే। విప్రాయ వేదవిదుషే దద్యాద్దక్షిణయాసహ ॥ మాతృతః పితృతశ్చైవ కులమేకం సముద్ధరేత్ । మేరుముల్లఙ్ఘ్య సహసా విష్ణులోకం ప్రపద్యతే ॥ — ॥ లిఙ్గపురాణే ప్రాయశ్చిత్తమాహ ॥ శకటం యోనుగృహ్ణీయాద్యాగతీర్థపరాఙ్ముఖః । పుణ్యకాలేషు పుణ్యర్క్షే సభవేచ్చక్రధారకః ॥ ఏతత్పాపవిశుద్ధ్యర్థం చరేచ్చాన్ద్రాయణాష్టకమ్ । యాగాద్యకరణే దోషః శకటస్య ప్రతిగ్రహే ॥ ప్రధానం సమ్పరిత్యజ్య ప్రాయశ్చిత్తం సమాచరేత్ । పరిషదుపస్థానపూర్వకం పూర్వవత్ప్రాయశ్చిత్తం కుర్యాత్ ॥ — ॥ ఇతి

శకటప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥ — ॥ అథ ఉభయతోముఖీప్రతిగ్ర

## ॥ ఉభయతోముఖీప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥

హప్రాయశ్చిత్తమాహ ॥ — ॥ స్కాందే ॥ సూయమానాం యదా ధేనుం పరిక్రమ్య ప్రణమ్య చ । యో దద్యాద్విప్రవర్యాయ స వై విష్ణుపదం వ్రజేత్ ॥ సాయం వా ప్రాతరథవా సూయమానాం విలోకయన్ । శిరఃపాదౌ యదా వక్త్రే తదా దానం మహత్తరమ్ ॥ పిత్రూనుద్దిశ్య వా రాజన్నుత విష్ణుం హరం చ వా । తం తం లోకమవాప్నోతి పునరావృత్తివర్జితమ్ ॥ — ॥ మహానారదీయే ॥ సూయమానా యదా ధేనుః సర్వపాపక్షయంకరీ । తదా నరేణ దాతవ్యా విప్రాయాధ్యాత్మవేదినే ॥ న తస్య పునరావృత్తిర్బ్రహ్మలోకాత్కదాచన ॥ — ॥ శివధర్మోత్తరే ॥ ద్విముఖీం వత్సదాం ధేనుమనువ్రజ్య ప్రణమ్య చ । యో దద్యాద్విప్రవర్యాయ స తు బ్రహ్మపదం వ్రజేత్ ॥ — ॥ మహాభారతే ॥ ద్విముఖీం వత్సదాం శుద్ధాం విలోక్య జనవల్లభ । పరిక్రమ్య ప్రణమ్యాథ ద్విజాయాధ్యాత్మవేదినే ॥ బహ్వీభిర్దక్షిణాభిశ్చ దద్యాద్యది నరోత్తమ । యావన్తి పశురోమాణి తావద్బ్రహ్మపదం వ్రజేత్ ॥ తత్ప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥ — ॥ దేవీపురాణే ॥ ద్విముఖీం వత్సదాం ధేనుం విప్రో లోభపరాయణః । ప్రతిగృహ్య ద్విజో దేవి యావద్భోగపరాయణః ॥ తావద్యుగసహస్రాణి నారీత్వం ప్రాప్నుయాదిహ ॥ — ॥ కౌర్మే ॥ ద్విజో యో ద్విముఖీం ధేనుం సోపస్కరసదక్షిణామ్ । సవస్త్రాం విధివద్గృత్వా తదా మృత్యువశం గతః ॥ నరకానుభవం కృత్వా నారీజన్మ సమశ్నుతే । నారీపాపస్య మూలం హి కిము తస్య ప్రతిగ్రహే ॥ యావన్తి పశురోమాణి తావన్నరకమశ్నుతే । కేచిత్పుంస్కారమిచ్ఛన్తి హ్యుభయోర్ముఖసంగ్రహే ॥ స్త్రీత్వాపత్తిదోషబాహుల్యాత్ప్రాయశ్చిత్తవిధానతః । లక్షత్రయేణ గాయత్ర్యాశ్శుద్ధిమాప్నోతి దైహికీమ్ ॥ యాగాదిభ్రంశనే తాత ప్రాయశ్చిత్తమిదం చరేత్ । ప్రాయశ్చిత్తేన పూతాత్మా ప్రధానం సమ్పరిత్యజేత్ ॥ అనేనవిధినా శుద్ధిర్నత్వేకైకార్ణజపాదిభిః । లక్షత్రయజపానన్తరం పునస్సంస్కారం కృత్వా హ్యుభయతోముఖీప్రతిగ్రహాచ్ఛుద్ధిరితి తాత్పర్యమ్ ॥ — ॥ ఇత్యుభయతోముఖీప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥ — ॥ అథోత్క్రాన్తిగోప్ర

—— శ్రీ ఉత్క్రాన్తిగో ప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ శ్రీ ——

తిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥ — ॥ మార్కండేయః ॥ విపత్సూత్క్రాన్తికాలేతు హ్యవిచార్య మహద్భయమ్ । తాం ధేనుం ప్రతిగృహ్యైవ మహాపాతకమశ్నుతే ॥ — ॥ దేవీపురాణే ॥ ఉత్క్రాంతిధేనుమాసన్నాం తన్మూల్యం వా యథార్థతః । ప్రతిగృహ్య ద్విజోయస్తు సవైనరకమశ్నుతే ॥ — ॥ కౌర్మే ॥ ద్విజోయశ్శ్రీసమ్పన్నః ప్రతిగ్రహపరాయణః । ఉత్క్రాన్తికాలే తన్నామ్నీం ధేనుం ధృత్వాసదోషభాక్ ॥ నరకాననుభూయాశు దరిద్రోభువిజాయతే । అన్నవస్త్రపరిక్షీణస్సదారో బహులప్రజః ॥ కిం కరోమి క్వగచ్ఛామి కంవా శరణమాశ్రయే । ఇతీవ వర్తయన్నిత్యమేతద్దారిద్ర్యలక్షణమ్ ॥ దారిద్ర్యం మరణాత్కష్టం దరిద్రోనహిపూజ్యతే । దరిద్రస్య వృథా జన్మదరిద్రస్య వృథా వయః ॥ దరిద్రస్య వృథారూపం దరిద్రస్య వృథాగుణాః । తత్రాపి బాలదారిద్ర్యం క్షణమాత్రం నశక్యతే ॥ తత్ప్రాయశ్చిత్తమాహ ॥ — ॥ భవిష్యోత్తరే । ఉత్క్రాన్తిధేనుమాగృహ్ణన్ ప్రధానం సమ్పరిత్యజేత్ ॥ లక్షద్వయేన గాయత్ర్యాశ్శుద్ధిమాప్నోత్యనుత్తమాం । నాన్యథాశుద్ధిమాప్నోతి దరిద్రత్వేన్నముక్తిభాక్ ॥ దారిద్రంజన్మధిగ్రూపం ధిగ్దరిద్రంపునఃపునః । దారిద్ర్యజనకం ధేనోర్గ్రహణం నభవేదిహ ॥ — ॥ ఇతి ఉత్క్రాన్తిధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ — ॥ అ

—— *వైతరణీప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ * ——

థ వైతరణీప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥ — ॥ కూర్మపురాణే ॥ యమలోకే మహాఘోరే సరిదఙ్గారరూపిణీ । షష్టియోజనవిస్తీర్ణా శతయోజనమాయతా ॥ సా సరిత్పాపినాదృష్ట్వా ప్రజజ్వాలతదారుషా । దృష్ట్వాపుణ్యజనాన్ సైవ శాన్తిమాప్నోతి తత్క్షణాత్ ॥ పాపినఃపాపకర్మాణః పుణ్యవాన్పుణ్యమాచరేత్ । పాపీ నరకమాప్నోతి పుణ్యవాన్ పుణ్యలోకభాక్ ॥ పుణ్యం సుఖార్థీ కుర్వీత దుఃఖార్థీపాపమాచరేత్ । దుష్టప్రతిగ్రహఏవపాపం ॥ తదపరిగ్రహఏవ పుణ్యం ॥ దుష్టప్రతిగ్రహఉత్క్రాన్తివైతరణ్యాదిః తేషాం త్యాగఏవ పుణ్యం । ద్రవ్యస్యాల్పత్వాత్పాపబాహుళ్యాద్యాగాదికరణస్యాశక్యత్వాత్పరిత్యాజ్యమేవ సర్వథా ॥ — ॥ మాత్స్యే ॥ — ॥ దా

రిద్ర్యం స్థిరతామేతి వైతరణ్యాః ప్రతిగ్రహే । సర్వేషామేవ పాపానాం
దారిద్ర్యమధికం విదుః ॥ దారిద్ర్యాద్దోషబాహుల్యాత్త్యజేదేతత్ప్రతిగ్ర
హం । దారిద్ర్యాదపరం పాపం జనస్యేహ న విద్యతే ॥ తత్ప్రాయశ్చిత్తమా
హ ॥ — ॥ స్కాన్దే ॥ ప్రతిగృహ్య ద్విజో ధేనుమాశౌచాన్తే నరాధిప ।
పిణ్డనిర్వాపణే కాలే దీయమానాం దరిద్రిణాం ॥ ప్రధానం సమ్పరిత్యజ్య
స్నాత్వా నిత్యం సమాహితః । లక్షద్వయం జపేద్దేవీమేతద్దోషాపశాన్త
యే ॥ నాన్యథా శుద్ధిమాప్నోతి దారిద్ర్యాన్న విముక్తిమాన్ ॥ — ॥ ఇతి వై
తరణీధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥ — ॥ అథ మృత్యుమహిషీప్రతి

## — మృత్యుమహిషీప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ —

గ్రహప్రాయశ్చిత్తమాహ ॥ — ॥ మార్కణ్డేయే ॥ విప్రో యో మ
హిషీం గృహ్ణన్ సాక్షాన్మృత్యుస్వరూపిణీం । మృత్యునాశకరీం దాతుః గృ
హీతుర్మృత్యుదాయినీం ॥ అభ్యర్చ్య నీలవస్త్రాద్యైర్ధాన్యైర్దక్షిణయా స
హ । సాక్షాన్మృత్యుమవాప్నోతి షణ్మాసాభ్యన్తరే నృప ॥ — ॥ స్కాన్దే
మహిషీం యోను గృహ్ణీయాత్ మృత్యుదాం పాపనాశినీమ్ । ధాన్యైర్గం
ధాక్షతైస్తైలైరర్చితాం మృత్యురూపిణీమ్ ॥ సమక్షం రోగిభిర్దత్తాం బ్రా
హ్మణో భయవర్జితః । మృత్యుమాప్నోతి సహసా పశ్చాత్సూకరతాం వ్రజే
త్ ॥ — ॥ బ్రహ్మాణ్డే ॥ భానుః కుజో భృగుశ్చైవ శనీ రాహుర్గ్రహాస్త్వమీ
ద్వాదశాష్టమజన్మస్థాః పశ్యన్తే యస్య దేహినః ॥ కుర్వన్తి ప్రాణసన్దే
హం స్థానభ్రంశం ధనక్షయమ్ । తదా మృత్యువశం యాతః పీడితో గ్రహ
నాయకైః ॥ — ॥ పీడాః ॥ జ్వరశ్శూలం వాతపిత్తం శ్లేష్మాల్పణమసూరి
కాః । విషూచీ గ్రహణీపాదహస్తశూలం మహద్భయమ్ ॥ జ్వరాతిసారౌ
నిశ్శక్తిః మూర్ఛా భ్రమణమేవ చ । కమ్పో వా బహుమూత్రో వా రోగాణ్యా
ణాం భవన్తి హి ॥ సర్వరోగవినాశాయ మృత్యూత్తరణహేతవే । తదా
యో మహిషీం దద్యాత్పూజితాం వస్త్రభూషణైః ॥ మృత్యురూపాయ వి
ప్రాయ స నద్యో రోగముక్తిభాక్ । గృహ్ణీయాన్మహిషీమేనాం ద్విజో దరి
ద్ర్యాతురస్తదా ॥ మృత్యుమాయాతి సహసా సూకరత్వమవాప్యతే । త
త్ప్రాయశ్చిత్తమాహ ॥ — ॥ గారుడే ॥ తదానీం వా పరేద్యుర్వా స్నా

త్వా శుచిరలఙ్కృతః । నిత్యకర్మవిశుద్ధాత్మా జపేన్మృత్యువినాశనమ్ ॥ అయుతం నియుతం కృత్వా త్ర్యహం సఙ్ఖ్యయా నృప । అయుతేన విశుద్ధస్స్యాన్మహిషీం తేనానుమన్యతే ॥ పక్షమాత్రం దశాహం వా దీక్షామారభ్య బుద్ధిమాన్ । చతుర్థకాలఆయాతే హవిర్భోజనమాచరేత్ ॥ అపమృత్యుమపక్షుధమితి నవభిర్వాక్యైః జపః ॥ — ॥ ఇతి మృత్యుమహిషీప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥ — ॥ అథ మహిషీప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ —

— మహిషీప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ —

వామనపురాణే ॥ కృష్ణాఙ్గారచతుర్దశ్యాం కృష్ణాష్టమ్యామమాదినే । మహిషీం నీలవస్త్రైర్ద్రవ్యైరర్చితాం సర్వభూషణైః ॥ దద్యాద్యో విప్రవర్యాయ తస్య నాస్తియమాలయః ॥ — ॥ స్కాన్దే ॥ యుగాదిషు చతుర్ష్వేషు కృష్ణాష్టమ్యామమాదినే । కృష్ణాఙ్గారచతుర్దశ్యామమాయాం భృగువాసరే ॥ మహిషీం సమలఙ్కృత్య వస్త్రగన్ధాదిభూషణైః ॥ యో దద్యాద్విప్రవర్యాయ యమపీడానివృత్తయే । యమస్త్వం పూజయన్ పశ్యన్ ప్రత్యుద్గానాదివన్దనైః ॥ స్వర్గలోకం నయత్యాశు లోకో బన్ధుజనం యథా । తస్యైవ పూర్వవత్పుత్ర నిష్కృతిః కథితా బుధైః ॥ తేన శుద్ధో భవేద్విప్రః పాపాదస్మాత్ప్రముచ్యతే ॥ — ॥ ఇతి మహిషీప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥ —

— గోముఖజననశాన్తిధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ —

అథ గోముఖజననశాన్తిధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥ — ॥ దేవీపురాణే ॥ అభుక్తే గణ్డనక్షత్రే లగ్నసన్ధౌ చతుర్దశీ । తథైవ విషనాడీషు వ్యతీపాతే చ వైధృతౌ ॥ మాతా పితా తథా జ్యేష్ఠభ్రాతుర్నక్షత్రసమ్భవే । ఏతేషు సమ్భవః పుత్రః కులనాశకరో భవేత్ ॥ — ॥ అభుక్తసంజ్ఞామాహ ॥ జ్యోతిర్నిబన్ధే ॥ ఆశ్లేషామఘానక్షత్రసన్ధిః । జ్యేష్ఠామూలానక్షత్రసన్ధిః । రేవత్యశ్వినీసన్ధిః । ఇత్యేతే హ్యభుక్తాః ॥ కుళీరసింహయోః కీటచాపయోర్మీనమేషయోః ॥ గణ్డాన్తమన్తరాళం స్యాద్ఘటికాద్వితయం స్మృతమ్ । ఏతేషు జాతః పుత్రో వా పుత్రీ వాతిథిగణ్డకే । మధ్యే పూర్ణానన్దయోస్తు పితరౌ హన్త్యసంశయమ్ ॥ ఆశ్లేషా చిత్రా జ్యేష్ఠా మూలా పుష్య పూర్వాషాఢా హస్తా భరణీ విశాఖా ఏతాని గణ్డనక్షత్రాణి । ద్వయోర్లగ్నయోరన్తరాళం ల

గ్నసన్ధిః । చతుర్దశీ కృష్ణచతుర్దశీ । అమా చ స్పష్టా ॥ ఏతద్దోషవిముక్త్యర్థం జననం గోముఖాత్పురా । పశ్చాచ్ఛాన్తిం ప్రకుర్వన్తి తత్తద్దోషోపశాన్తయే ॥ సా ధేనుర్విప్రసూర్లోకే సర్వమఙ్గలకారిణీ । స్వజాతిప్రసవం త్యక్త్వా హ్యన్యజాతిం ప్రసూయతే ॥ తదా ప్రభృత్యసౌ ధేనుస్సర్వపాపవివర్ధినీ । తస్మాదేనాం ద్విజో ధృత్వా సద్యః పాతిత్యమర్హతి ॥ మృత్వా నరకమాప్నోతి పుళిందేష్వభిజాయతే । తస్యోపనయనం భూయః కుర్యాచ్చాన్ద్రాయణత్రయమ్ ॥ ఏషా తు నిష్కృతిస్తస్య నాన్యథా శుద్ధిరిష్యతే । పూర్వం పునస్సంస్కారం కృత్వా తేన శుద్ధో భూత్వా పశ్చాచ్చాన్ద్రాయణత్రయం కుర్యాత్పూతో భవతి ॥ — ॥ ఇతి గోముఖజననశాన్తిమద్ధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥ — ॥ అథ ఆలిఙ్గనదానప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ — ॥

—*ఆలిఙ్గనదానప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్*—

వామనపురాణే ॥ ధనార్థం ముఖజో యస్తు రోగిణం యది గూహయేత్ । స రోగీ భవతి క్షిప్రం తదా వర్షశతక్రమాత్ ॥ ఉత పత్నీసుతో వాపి నిధనం యాతి పార్థివ । తం కదా నాలపేద్విప్రో యది నిస్తానుషా మహీ ॥ — ॥ గారుడే ॥ ధనార్థం యది యో విప్రో మహాన్తం రోగిణం నరమ్ । ఆలిఙ్గ్య సహసా భూమౌ రోగీ భవతి నిశ్చయః ॥ యమలోకముపాగమ్య భుక్త్వా తత్రైవ వేదనామ్ । పత్నీపుత్రవియోగస్స్యాత్సప్తజన్మాన్తరే నృప ॥ తద్దోషపరిహారార్థం ప్రాయశ్చిత్తం సమాచరేత్ । సూక్తమేనం జపేన్నిత్యం స్నాత్వా శుచిరలఙ్కృతః ॥ మాసం వా పక్షమేకం వా దీక్షామారభ్య వాగ్యతః । హవిష్యాశీ భవేన్నిత్యం స్వపేన్నారాయణం స్మరన్ ॥ పరేద్యురేవం కుర్వీత హ్యయుతం యది పూర్యతే । తదా విసృజ్య నియమం బ్రాహ్మణాన్భోజయేత్తతః ॥ ఏవం యః కురుతే సమ్యక్ప్రాయశ్చిత్తం విశుద్ధయే । సద్యస్తరతి పాపాని పాపేభ్యో ముచ్యతే తదా ॥ ముఞ్చామి త్వేతి ప్రముక్తమేనమిత్యన్తమ్ ॥ — ॥ ఇత్యాలిఙ్గనదానప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥

—*దుష్టనక్షత్రశాన్తిధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్*—

అథ దుష్టనక్షత్రశాన్తిధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥ — మార్కణ్డేయే ॥ దుష్టభే విషనాడీషు వ్యతీపాతే చ వైధృతౌ । అమాకృష్ణచతుర్దశ్యోః

పిత్రోర్నక్షత్రకే యదా ॥ చన్ద్రసూర్యగ్రహే చైవ యస్యపత్నీ ప్రసూయతే । తదా శాన్తిం ప్రకుర్వీత తత్తద్దోషోపశాన్తయే॥ శాన్త్యఙ్గభూతా యా ధేనుస్సా దేయా విప్రపుఙ్గవే । ఏతస్మిన్ దుష్టనక్షత్రే జాతస్య శిశోర్దోషశాన్త్యర్థం తత్తన్నక్షత్రాధిదేవతాప్రీత్యర్థం తత్తద్దేవతావర్ణా గౌర్దేయేతి మయా శాన్త్యధ్యాయేభిహితమ్ ॥ అలాభే కపిలా వా తదాచార్యత్వే ధేనుస్స్వమ్భవతి । తదా ప్రాయశ్చిత్తీభవతి ॥ —తత్ప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥ కౌర్మే ॥ దుష్టనక్షత్రజాతస్య శాన్తికర్మసు యోద్విజః । ఆచార్యత్వం యదా కుర్యాద్గౌరత్ర ప్రతిగృహ్యతే ॥ తస్యైవ నరకే వాసః కాలసూత్రే మహత్తరే । తదన్తే భువమాసాద్య షాణ్డత్వమవాప్నుయాత్ ॥ తద్దోషపరిహారార్థం ప్రాయశ్చిత్తం విశుద్ధిదం । ప్రాయశ్చిత్తేన పూతాత్మా శుద్ధిమాప్నోతి పూర్వజః ॥ స్వాధ్యాయదివసే రాజన్నుపవిశ్య సుఖాసనే । తదా పారాయణం ప్రోక్తం దశరాత్రమతన్ద్రితః ॥ తతఃపరముపోష్యైవ పఞ్చగవ్యేన శుధ్యతి । సంహితామాత్రపారాయణం । నపదక్రమాది । నపరాయతాది పఠనమ్ । పశ్చాత్పఞ్చగవ్యం పీత్వా శుద్ధిమాప్నోతి నాన్యథా । వేదో నారాయణస్సాక్షాదితి స్మరణాత్ ॥ — ॥ ఇతి దుష్టనక్షత్రజననశాన్తిషు ధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥ — ॥ అథ దుష్టనక్ష

## దుష్టనక్షత్రే ప్రథమరజోదర్శనశాన్తిధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్

త్రే ప్రథమరజోదర్శనశాన్తిధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥—॥ మార్కణ్డేయః ॥ యస్యపత్నీ నరశ్రేష్ఠ దుష్టర్క్షేష్వాహపుష్పిణీ । పత్నీ వాథస్వయం వాథ హ్యావశ్యం మృత్యుమావిశేత్ ॥ భరణీ కృత్తికార్ద్రా పునర్వసూ ఆశ్లేషా మఘా పూర్వఫల్గునీ జ్యేష్ఠా పూర్వాషాఢోత్తరాషాఢా పూర్వాభాద్రా ఏతాని దుష్టనక్షత్రాణి ॥ ప్రతిపద్ద్వితీయా చతుర్థీ షష్ఠీ అష్టమీ నవమీ ద్వాదశీ ఉభయత్ర చతుర్దశీ అమా ప్రథమార్తవే ఏతాని దుష్టదినాని ॥ భాన్వఙ్గారకమన్దవారాః । ఇతి దుష్టవారాః । మేషలగ్నం వృషభలగ్నం సింహలగ్నం । ఏతాని దుష్టలగ్నాని । జామిత్రే । ప్రథమరజోదర్శనం లగ్నాత్సప్తమలగ్నం జామిత్రస్థానం । తత్ర దుష్టగ్రహశ్చేజ్జాయాపత్యోరమఙ్గళప్రాప్తిః । ఏతేషు నారీప్రథమరజోదర్శనకాలే । ఏకైకం ద్వయం

